

21—4—67 చైత్ర శుద్ధ ద్వాదశి ప్లవంగ

శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 29—వ పుణ్యవర్ధంతి

ప్రవిమల జీవిత ప్రసృమర ప్రథితాకృతు లాత్తధర్మసా
ర వివశచిత్తు లార్యగుణరంజనమంజులదానవీరులున్
తవులరు నిన్నుబోలు మహితాత్మకు లెచ్చట నీవొకండవున్
[illegible]

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1967

# వరివస్య

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

నీ కరపల్లవద్వయము నేడు గదించిన భాగ్య మబ్బుటన్
నా కరముల్ కృతార్థములు; నా యెద బుట్టి సుధాప్రవాహముల్
వాకలు గట్టి యిప్పుడును జారెడి చేతము చల్లజేయుచున్
మై కలయంగ వీచికల మాడ్కి గగర్పలు ప్రాకుచుండగా.

మురిపము గొల్పు నచ్చతెలిముత్తెపుమూర్తివి, మాటలాడినన్,
చిరునగ వొల్కబోసినను, చేతులు మోడ్చి సమాదరించినన్,
కరుణదొలంకు గల్వతెలిగన్నుల చల్లనికాంతి నాపయిం
బరపిన, స్వాతిముత్యముల వానలు జిల్లిన జల్లు నా హృదిన్

నీ వొక జాజికన్నియవు, నీ సవిధంబున నిల్చినంతనే,
ఏవియొ గాఢపూర్వభవవృత్తులు భవ్యములున్ మనోజ్ఞముల్
పావనముల్ శుచిస్మృతుల వాసనలై హృది పేటురేగి యా
ప్లావితు జేసి సాధువృదువాయుపథంబుల దేల్చు లీలమై.

నీ వొక దివ్యరాగిణివి, నిన్ను స్మరించిన హృద్విపంచికన్
తీవలు సంచలించి యొక తీయని వేదన గోట మీటగన్
కేవలదేవయోనులె గణింప ధరింపను సాధ్యమైన ప్రా
స్తావికగీతరాగనినదంబులు మ్రోసెడి తారవీథులన్.

నీ వొక యగ్నికీలికవు, నిన్ను స్పృశించినయంతమాత్ర నే
వేవియొః జన్మజన్మముల నేరిచి కూర్చిన కిల్బిషంపు పెన్
బ్రోవులు తూలరాసులటు రూపఱి నీరయి పోవ, నుజ్జ్వలత్
పావనదివ్యమూర్తివిభవంబున దీపికనై వెలుంగుదున్.

నీ వొక చంద్రమఃకళవు, నీ వమృతంబు ఘనీభవించుటన్
ప్రోవయి రూపుగొన్న శుభమోహనరేఖవు; దిగ్దిగంతముల్
నీ వొలికించు వెన్నెలల నిద్దపుజాలుల వెల్గు దేటలై,
నీ వరివస్య సంతతము నిన్ను భజించుట నేను ధన్యుడన్!

---

# కాకతీ మైలాంబ బయ్యారం చెఱువు శాసనము

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

ఆంధ్రప్రదేశ పురావస్తు పరిశోధన శాఖవారిచే రాష్ట్రమందలి ప్రాచీన శిలాశాసనము లన్వేషింపబడు సందర్భమున ఖమ్మంమెట్టుజిల్లా యెల్లెందుతాలూకాలో బయ్యారమను గ్రామమునకు చెందిన బయ్యారంచెఱువు కట్టపై నీ శాసనము కనుగొనబడెను. 6 అడుగుల పొడవు, 2 అడుగుల చతురస్రము గల యొక బృహచ్ఛిలపై 4 వైపుల 185 పంక్తులలో నీ శాసనము చెక్కబడి యున్నది. అచ్చటచ్చట కొలదియక్షరములు స్ఫుటితములైననూ శాసనమంతయు భద్రముగనే యున్నది. భాష సంస్కృతము. లిపి 13 వ శతబ్దినాటి తెలుగు. అక్షరములసొంపు లేఖకుని యొక్క నేర్పును ప్రకటించుచున్నవి. శాసనమంతయు నిర్దుష్టమై కాకతీయుల నాటి శిలాశాసనములలో మేలురకపు దనిపించును.

కాకతి మహాదేవుని కుమార్తెయు గణపతిదేవుని కనిష్ఠ సోదరియు, నతవాట రుద్రుని భార్యయునగు మైలాంబిక శాసన మున్నచోట గొప్ప తటాకము నొకదానిని నిర్మించినట్లు చెప్పుట శాసనము యొక్క ముఖ్యోద్దేశము. ప్రాసంగికముగా కకతీయుల పూర్వచరిత్రనుగూర్చి కొన్ని అపూర్వవిషయము లిందుచెప్పబడియుండుటచే హనుమకొండ వేయి స్తంభములగుడి యందలి రుద్రుని శాసనమువలె నిదియు వారి చరిత్రకు కడు ప్రధానమైనది.

## శాసన విషయము : మొదటి ప్రక్క :

"శ్రీ మహాదేవాయనమః" అని ప్రారంభమై గజాననుని, క్రోడరూపియగు విష్ణువును, అర్ధనారీశ్వరుని, స్తుతించుచు సృష్టికర్తయగు బ్రహ్మ వర్ణించబడును. ఆయన బాహువుల తేజోమహిమచే రాజన్యసంతతి జనించెను. అదే సంతతియందు దుర్జయుడను రాజు సార్థకనాముడై శత్రువులకు భయంకరుడై పుట్టెను. అతని వంశములో వెన్నడను రాజు కాకతి యనుచోటు (నగర)నుండి రాజ్యమేలుటను బట్టి యా వంశ్యులు కకతీపు లనబడు చుండిరి. వాని పుత్రుడు, పౌత్రుడు, నప్తవరుసగా గుండ నామధారులై పరాక్రమమున ముగ్గురి రాములకు సరియై యుండిరి. ఆటు పిమ్మట ఎఱ్ఱనృపతి కుఱ్ఱవాడి మున్నగు దేశమును పాలించు చుండెను. వాని తర్వాత పిండి గుండ నృపతి శత్రుక్షయమొనర్చి రాజయ్యెను. వానికి పుట్టిన గరుడాంకబేత నృపతి యా పేరుగల అన్వయమగుటచే నట్లు ప్రసిద్ధ నామధేయు డయ్యెను. ఇతడు అనుమడు, కొండడు అను వీరుల జంపి ప్రసిద్ధమగు అనుమకొండను పురముగ జేసికొనెను. వానికి ప్రోలక్షితిపతి జనించి అరిగజకేసరి అను బిరుదనామధారియై కేసరి తటాకమును నిర్మించెను. ఇట్లీతనిచే భూమియుద్ధృతి మైనదని తెల్పుటకో యన్నట్లీతని సంతతి వరిచే కృతజ్ఞతా సూచకముగా స్వర్ణ (నాణెము) గవాదుల (పశువులు) పై వరాహముద్ర వేయబడు చుండెను. వానికి ముల్లోక పాలకులను భయకంపితులను చేయు త్రిభువన మల్ల భూమిపాలుడు పుట్టెను. వానికి ప్రసిద్ధ కీర్తిశాలియు కందర్పస్పర్ధి రూపసంపన్నుడును, తుంగతురగ యుద్ధ కౌశలుడును అగు ప్రోల భూపాలుడు జన్మించెను. వానికనేక పుత్రులు ఉదయించిననూ, రుద్రదేవ, మహాదేవ భూపతులు ప్రసిద్ధులు. అందు రుద్రుడు అమానుష బలసంపన్నుడై, వైరివీరనిధినిర్మథన మొనర్చిన పురపవరు డగుటచే వానిని లక్ష్మి స్వయముగ వరించెను. మహాదేవుడు సమస్త సామంతుల శిఖామణులచే సముత్తేజితమగు పాదపీఠముగల గొప్ప రాజు. పురారి భక్తుడగు నతనికి గౌరీసేవాసక్తిగల బయ్యమాంబ ధర్మపత్నియై సీమంతినీతిలకమై యొప్పు చుండెను. వానికి దుష్ట నిగ్రహ శిష్ట రక్షణకుశలుడును, సంపదలప్రోవును ననదగు గణపతి జన్మించెను.

## రెండవ వైపు

తదుపరి శుభగ్రహోద్యమగు శకవర్షము 1105 కు సరియగు శోభకృద్వత్సరమున ఆ బయ్యాంబా మహాదేవులకు సర్వ లోకానందదాయి యగు నొక కన్యక జన్మించెను. ఆమెకు పితరులు శ్రీశైల శిఖర వాసియగు శ్రీ మల్లికార్జునదేవుని స్మరించుచు శ్రీ మల్లికాంబ (మైలాంబ) యను జన్మ నామమిడిరి. కాలము గడచిన కొలది ఆమె తన ధర్మ కర్యముచే ధర్మ కీర్తి యను బిరుదనామ మొందెను. మహాదేవుడు గణపతి వివాహమైన పిదప యుక్తవయస్కురాలగు నీమెకు తగిన వరుని యోచింపుడని మంత్రుల నడుగగా వారు అంగి, వంగ,

కళింగి, చోడ, చాళుక్య, హైహయ మాలవాది నృపతులలో నొక
రును ఈమెకు తగిన వరుడు కారాడని చెప్పి తుదకు సతి
వాటి వంశమునకు చెందిన రుద్రుని వరునిగ సూచించిరి.
అందుకు, మహాదేవుని తల్లియగు ముప్పమాంబకు సతవాటి
దుర్గక్షితీశుడు సోదరు డగుటచే తనకు మేనమామ యగు
ననియు, పక్కడి మల్లనామ ధారియగు నాతనికి కిడిజేలుపాత
బిరుదాంచితుడగు బుద్ధ భూపాలుడు పుత్రుడనియు, వానికి
పత్నియగు ముప్పమాంబయందు శూరుడు, అకలంకుడు,
యువకుడు, కన్యాసవర్ణుడు, కుసుమేషుమూర్తియు నగు
రుద్రుడు ఆమెకు సర్వవిధముల తగినవాడట. (తదుపరి
మైలమాంబకు నతివాటి రుద్రునితో వివాహము వర్ణించ
బడినది.)

## మూడవ వైపు

ప్రఖ్యాత రుద్రానుజ నృపుని తనయయు, భద్రరుద్రు
లకు అగ్రజయు, విఖ్యాత రుద్రుని పత్నియు, రుద్రదేవుని
మాతయు, రుద్రాణీశుని భక్తురాలగు మైలమాంబ భర్త
యగు రుద్రనృపుని యనుమతితో శంభురుద్రుని కొరకు
అనేక ధర్మకార్యము లొనర్చెను. (శ్లో.42.) గ్రామ గ్రామమున
దేవాయతనము, అన్నశాల, మార్గ మార్గమున ఆరామ స్థాపనము
ప్రపాలి, అంతట అగ్రహార ప్రదానము— ఇవి మైలమాంబ
యొక్క ధర్మ కార్యములు. సేతువు వద్ద ఒక శివాలయము,
శ్రీపర్వత మందొక శివాలయము, కాశీపుర మందొక
శివాలయము తన స్వనగరమగు ఇనగుర్తి యందొక శివాలయ
మును నిర్మించి తన భర్తపేరిట, తన పేరిట శివపార్వతులను
ప్రతిష్ఠ చేసెను. తల్లియగు బయ్యాంబపేరిట, తండ్రియగు
మహాదేవునిపేరిట, తన బిరుదమగు ధర్మకీర్తి పేరిట ఇచట
పురముల నిర్మించి భూమండలమందు గల యెల్ల రాజనగరుల
కంటె మిక్కిలి శోభాయుతములుగా నలంకరించెను. (నగర
వర్ణనము.)

## నాలుగవ వైపు

ధర్మకీర్తి యను గుణ నామధారిణియగు మైల
మాంబ యిచట నామె మనస్సువలె గంభీరమైనట్టియు,
ఆమె యశస్సువలె విస్తారమైనట్టియు, ఆమె వాక్కువలె
మధురమగునట్టియు, ఆమె భాగ్యమువలె సర్వజనోపభోగ్యమై
నట్టియు ఈ ప్రసిద్ధ తటాకమును నిర్మించెను. ఈ తటా
కము తూర్పు వైపున మిన్ను ముట్టు కట్టతో ఆకాశమును,
ప్రశస్తములగు సస్య సంపదలతో భూమిని, కాలువలతో దిగంత
ములను, గాంభీర్య ధర్మముచే నాగలోకమును వ్యాపించి విశ్వాత్మ
కమై యొప్పుచున్నది. (ఇటమీద తటాక వర్ణనము.)

ఇట్లు శాసనము 71 శ్లోకములతో ముగియుచున్నది.
ఇందు శాసనపు కాలముగాని కవి పేరుగాని చెప్పబడలేదు.

(ఈ తటాకము బయ్యారమునకు 3 మైళ్ళ దూరమున
గలదు. దీనికి సంబంధించిన ఖమ్మంమెట్టులో ఇరిగేషన్
శాఖకు చెందిన శ్రీ ఎస్. మల్లయ్యగారు (జూనియర్ ఇంజనీరు
తెలిపిన ప్రస్తుత వివరము:

| | |
|---|---|
| విస్తీర్ణము: | 43 మిలియన్ల చ. అ. |
| కట్టనిడివి: | 7300 అ. |
| కట్ట యెత్తు | 35 అ. |
| పరిమాణము: | 397 మి. ఘ. అ. |
| సాగుబడి: | 5400 యకరములు. |

(బయ్యారము, ఇర్పులాపురము, కన్నయగూడెము, గన్దం
పల్లి, క్రొత్తపేట, సత్యనారాయణపురం గ్రామములలో)

దీని ప్రధాన బహిర్ద్వారము పూర్వము 20' × 5'
వైశాల్యము గలదిగా నుండెననియు చెఱువులో పూడిక యేర్ప
డుటవలన నది నిరుపయోగమయిన కారణముగా దానిపైన
ప్రస్తుతపు తూము నిర్మించబడెనని చెప్పిరి. తెలంగాణములో
లక్నవరము, పాఖాల, బయ్యారము చెఱువులు ప్రధానమైన
వనియు, ఈ మూడును 220 చ. మైళ్ళ విస్తీర్ణము గల
పీఠభూమికి మూడు వైపుల ప్రవహించు వాగుల నరికట్టుచు
నిర్మింపబడెననియు చెప్పిరి. ఈ మూడు పెద్ద చెఱువులు
కాకతీయులనాడు నిర్మింపబడినవే.)

బయ్యారములోను, చెఱువుకు సమీపములోను ఈ
మైలాంబచే వ్రాయించబడిన శాసనము లైదారు గలవు.
వాటిలో నిదియే ప్రధానమైనది. అందొకదానియందు రామ
దేవుడను కవి శాసనకర్తగా పేర్కొనబడెను. శాసనముల
కవిత్వశైలిని బట్టి యవి యన్నియు తద్రచితములుగనే
భావింప వీలగుచున్నది.

శాసనకాలము చెప్పియుండలేదు. కాని మైలాంబ
పుట్టినది శకము 1105 శోభకృద్వత్సరము. తర్వాత సుమారు
30— 40 సంవత్సరములు ఈ శాసన కాలమై యుండును.
అనగా క్రీ. శ. 1220—30 ప్రాంతము కావచ్చును.

### విశేషములు:

1. ఇందు మొట్టమొదట చెప్పదగిన విశేషము కాకతీయ
రాజుల వంశావళి. ఇంతవరకు లభించిన ఆధారములలో నీ రాజు
లను గూర్చి చెప్పబడు వంశానుక్రమణికలో నిదియే నూతన
నముగా ననేకులను తెలుపుచున్నది.

దుర్జయుడు

1. వెన్న
2. గుండ I
3. గుండ II
4. గుండ III
5. ఎఱ్ఱ
6. పిండి గుండ (గుండ IV)
7. గరుడబేత
8. ప్రోల I
9. త్రిభువనమల్ల
10. ప్రోల II (భార్య ముప్పమాంబ)

11. రుద్ర    12. మహాదేవ (భార్య బయ్యాంబ)    మరికొందరు

13. గణపతి    మైలాంబ (శాసనకర్త్రి)    భద్ర (భర్త నతవాటిరుద్రుడు.)    రుద్ర

ఇంతవరకు కాకతీయ వంశమునకు మొదటి బేతరాజే మూల పురుషుడుగ తెలిసియుండెను. దీనియం దాతనికి పూర్వికు లారుగు రున్నట్లు క్రొత్తగా తెలియవచ్చుచుండిరి. అందు 4, 5, 6, సంఖ్యల వారగు గుండ III, ఎఱ్ఱ, గుండ IV అను గూర్చి తూర్పుచాళుక్య వంశపు రెండవ అమ్మరాజాదని చెప్ప బడిన మాంగల్లు[1] దానశాసనములో కొంత చెప్పబడియున్నను వారు ప్రధాన కాకతీయ వంశముతో నెట్టి సంబంధము గల్గి యుండిరో నిశ్చయముగ తెలియకుండెను. ఇందు వారు ముగ్గురు మొదటి బేతనికి అవ్యవహిత పూర్వీకులుగా చెప్పబడిరి. వీరిది దుర్జయ వంశము. తెలుగునాటి నేలిన వెలనాటి చోళులు, చాగివంశము వారు, కొండపడుమటివారు, వెలమవారు, విరి యాలవారు, మరికొందరు కూడ దుర్జయ వంశ్యులమని చెప్పు కొనిరి. కాని వారు కాకతీయులతో సంబంధము కలిగియుండిరో లేదో తెలియదు. ఆ దుర్జయుడు ఒకడేనా? అనేకులా? ఇంతకు అతనిని గూర్చిన చరిత్రమేదియు తెలియదు. ఇందుకూడ దుర్జయుని విశేష మేమియు చెప్పబడలేదనవలెను. కాకతీయుల క్షత్రియత్వమును గూర్చి ముందు చెప్పబడును. తర్వాత చెప్ప బడిన వెన్న రాజునే మనము కాకతీయులకు కూటస్థునిగ భావించ వలెను. అతడు కాకతి నుండి భూమినేలుటనుబట్టి వాని వంశ్యులకు కాకతీయులను పేరు వచ్చెనని యిందు కలదు. ప్రతాపరుద్రీయవ్యాఖ్యాతయగు కుమారస్వామిసోమపీథి కాకతి యను దేవత నారాధించు వారగుటచే వారి కీ కులనామ మేర్పడె నని స్పష్టముగా వ్రాసెను. క్రీడాభిరామములో "కాకతమ్మకు సైదోడు ఏకవీర" (పు. 128.) అని కాకతమ్మ ఒక దేవత గనే చెప్పబడెను. జగ్గయ్యపేట ప్రాంతములో దొండపాడు దగ్గిర కాకతమ్మబీడు, అక్కడే కాకతిరామచంద్రపురము మున్నగు స్థలములు గూడ కలవట. దీనిని బట్టి కాకతియను నగరముపేరుతో నొక గ్రామదేవత వీరి కారాధ్య దైవమై యుండునని తెలియుచున్నది. అందుండి వీరు కొంత భూమిని పాలించిన వారగుటచే కాకతీయులై యుందురు. ఆ నగర మును గూర్చి ముందు చెప్పబడును.

వెన్ననృపుని పుత్రుడు గుండరాజు, పౌత్రుడు రెండవ గుండరాజు, మునిమనుమడు కూడ మూడవ గుండయయే. వీరు మువ్వురు పరాక్రమమున పరశురామ, రఘురామ, బల రాములకు ప్రసిద్ధి యైనవారట. తరువాత ఎఱ్ఱనృపుడు కుఱ్ఱి వాడి ముఖ దేశమునకు పాలకుడయ్యెను. వాని కొడుకు పిండి గుండయ.

ఇచట మాంగల్లు శాసనము నొకింత పరామర్శింపవలసి యున్నది. అందు చాళుక్య రెండవ భీముని పుత్రుడగు రెండవ అమ్మరాజు 11 సంవత్సరములు రాజ్యముచేసి రాష్ట్రకూట (మూడవ) కృష్ణుని కోపముచే కళింగమునకు పోగా అతని సవతి సోదరుడగు దానార్ణవుడు వల్లభుని ప్రసాదమున వేంగికి రాజై తనకు సహాయము చేసిన కాకర్త్య గుండ్యన కోరికపై అతని (గుండ్యన) శ్రేయోవాప్తికై అతికృచ్ఛ్రమగు కర్పటవ్రత మాచరించిన కుత్సగోత్రోద్భవుడైన దొమ్మన (శర్మ) కు మాంగల్లుగ్రామమును ఉత్తరాయణ పూర్వకాలమందు సర్వకర పరిహారముగా నగ్రహార మిచ్చెను. శాసన కాలము క్రీ. శ. 955 లోని ఉత్తరాయణ సంక్రాన్తి కావచ్చును. ఇచ్చట ప్రాసంగికముగా కాకర్త్య గుండ్యనయొక్క వంశావళి కొంత చెప్పబడెను. అందు సామన్తవొట్టికులమున గుండ్యన రాష్ట్ర కూటుడు గలడు. అతని పుత్రుడు —ఏరియ రాష్ట్రకూటుడు తురంగమారోహణకౌశలమున వత్సరాజును తిరస్కరించు నంతటివాడు. తరువాత కొద్ది భాగము లేఖక ప్రమాదమున

1. ఎ. పి. ఇండికా xxxi పుట. 31.

లోపించెను.(మాంగల్లు శాసనము 41 వ పంక్తి తుదియందు). 42 వ పంక్తి "తో బేతియ నామధేయః స్వసమస్తసంపన్నిలయ స్తదీయః" అని ప్రారంభమగును. లుప్తభాగమును పూరించి "అభూత్సుతో బేతియ నామధేయ స్సమస్త సంపన్నిలయ స్తదీయః" అని చదివిన బాగుండును. ఇంతకు బేతియ నామ ధారి యొకడు ఎఱియ రాష్ట్రకూటుని పుత్రుడుగ కన్పట్టు చున్నాడు. ఇతనిపేరు ప్రస్తుతపు బయ్యారపు శాసనమున కాన రాదు. ప్రతిభావంతుడై రాజ్య భారమును వహింపక ముందే తండ్రి జీవించి యుండగనే యాతడు మరణించియుండుట వంటి కారణ మేదైన యుండును. దానార్ణవునిచే దానమిప్పిం చిన కాకర్త్య గుండ డా బేతనకు పుత్రుడగుటచే నచట పేర్కొన బడెను. ఈ బయ్యారపు శాసనములోని వంశావళి యందు అముఖ్యుడుగా విడిచి వేయబడెనని తోచును. కాకర్త్య గుండడే యిచట పిండిగుండడనియు, సిద్ధేశ్వరచరిత్రము నందు పెండ్లిగుండడనియు పేర్కొన బడెను. అతని పుత్రుడు గరుడబేతరాజు. ఇతడే మొదటిబేతరాజను పేరిట కాకతివంశమునకు మూలపురుషుడుగ నెన్నబడు చుండెను. ఇతనికి పూర్వ మొక బేతరజు (ఇతని తాత) ఉండుటచే నితనిని రెండవ బేతరాజనవలసి యుండును. ఇతని నామమునకు ముందుగ గరుడాంక పద ముండుట యిచటనే ప్రథమముగ తెలియు చున్నది. దీనిని గూర్చి తరువాత. ఇత డేనుమడు, కొండడు అనువారిని నిర్జించి వారి పురమగు అనుమకొండను రాజ ధానిగ చేసికొనెను. జనశ్రుతిని బట్టియు, సిద్ధేశ్వరచరిత్ర మును బట్టియు నీవిషయము కొంత లోగడ తెలియు చున్నను శాసనస్థముగా బేతరాజే యనుమకొండను జయించి నట్లిచట చెప్పబడుట గమనింప దగినది. ఇతని పుత్రుడు అరిగజకేసరి బిరుదాంకితుడగు మొదటి ప్రోలరజు. అతనిచే కేసరి తటాక మనబడు గొప్ప చెఱువు త్రవ్వించబడెను. కేసరి సముద్రము కేసముద్రముగా రూపొందెననుకొన్న వరంగల్లుకు సుమారు 20 మైళ్ళ దూరములో కేసముద్ర గ్రామమునకు ఆనియున్న గొప్ప తటాక మిదియే కావచ్చును. ఈ తటాక ప్రతిష్ఠను స్మరించుచు నితని సంతతివారు వరాహచిహ్నము తమ నాణె ములపైనను, పశువుల మీదను ముద్రించు చుండెడివారట. ఇందువలన వీరి కీ వరాహముద్ర ఇంతకు పూర్వము లేదని తెలియు చున్నది. అతని పుత్రుడు రెండవ ప్రోలరజు. కజీపేట2 దర్గాశాసనము ననుసరించి త్రిభువనమల్లునకు దుర్గ రాజను మరియొక పుత్రుడు రెండవ ప్రోలునికి పూర్వము క్రీ. 1098 ప్రాంతమున రాజ్యము చేసినట్లు తెలియు చున్నది. అతని పేరీ శాసనమందు లేకపోవుట అతడు మైల మాంబకు పెదతాత యగుట కారణమై యుండును.

రెండవ ప్రోలున కనేకమంది పుత్రు లున్నను రుద్రదేవ మహాదేవులే ప్రసిద్ధులు. వీరుకాక ఈ మైలాంబ యొక్క త్రిపురాంతకం3 శాసనమున హరిహరుడు, గణపతి యను వార లిద్దరు ప్రోలుని పుత్రులుగ పేర్కొనబడి యున్నారు. ఒక్క ద్రాక్షారామ4 శాసనములలో నొకదానియందు దుగ్గభూపాలు డొకడు సందిగ్ధముగ తెలియ వచ్చుచున్నాడు. ఇంక మహా దేవుని సంతతిలో గణపతిదేవుడు, మైలమ, భద్రయు, రుద్రుడు ఈ శాసనమున చెప్పబడిరి. వీరుగాక మహాదేవునకు కుందాంబయను కుమార్తె యున్నట్లు కుందవరము, విడి గొండ, ముదునూరు5 శాసనములను బట్టి తెలియుచున్నది. ఈమెయు మైలాంబతో పాటు నతవాడి రుద్రునికి భార్యయే! మల్లికాంబ (మైలాంబ) శకము 1105 లో పుట్టి నట్లింతకు ముందు చెప్పియున్నాముగదా! కనుక ఈమె అన్నయగు గణపతిదేవుడు శకము 1103 (క్రీ. శ. 1181.) ప్రాంతమున జన్మించి యుండినను రాజ్యమునకు వచ్చు నాటికి (క్రీ. శ. 1199.) కనీసము పదునెనిమిది వర్షముల ప్రాయమువాడై యుండును. పై శాసనముల నంటని కూర్చు కొని కాకతీయ పూర్వరాజ వంశావళి నిట్లు తెలుపవచ్చును.

---

2. కార్పస్ ఆఫ్ తెలంగాణా ఇన్స్క్రిప్షన్సు—2 వ భాగము—25 వ పుట.

3. S. I. I. Vol. X—No. 254.

4. S. I. I. Vol IV—No. 1071.

5. అప్రకటితములు.

దుర్జయుడు

1. వెన్న
|
2. గుండ I
|
3. గుండ II
|
4. గుండ III (క్రీ. 900—912)
|
5. ఎఱ్ఱ (క్రీ. 912—950)
|
6. బేత I (............)
|
7. పిండిగుండ (గుండ IV క్రీ. శ. 950—990)
|
8. గరుడబేత (క్రీ. శ. 990—1055)
|
9. ప్రోల I (క్రీ. శ. 1055—1075)
|
10. త్రిభువనమల్ల (బేత III క్రీ.శ. 1075—1090శక1098)

11. త్రిభువనమల్ల దుర్గరాజు (క్రీ. శ. 1098—1115)

12. ప్రోల II (క్రీ. శ. 1115—1150)

13. రుద్రుడు (క్రీ.శ. 1150—1195)

14. మహాదేవుడు (క్రీ.శ. 1196—1199)

మరికొందరు
(1) హరిహరుడు
(2) గణపతి
(3) దుగ్గరాజు

15, గణపతిదేవుడు (క్రీ.శ. 1199—1262)

మైలాంబ కుందాంబ భద్ర రుద్ర

ఇద్దరు నతవాటి రుద్రుని భార్యలు.

## పైన చూపిన సంవత్సరములనుగూర్చి :

దానార్ణవుని మాంగల్లు శాసనములో కాకర్త్యగుండ్యనికాలం ఆశాసనకాలమే యగునుకదా. రెండవ అమ్మరాజు శకము 867 (క్రీ. శ. 945)లో సింహాసన మధిష్ఠించెను.[6] తర్వాత 11 సంవత్సరములు రాజ్యమేలిన పిదప రెండవ కృష్ణునిచే కలింగమునకు తరిమి వేయబడగా దానార్ణవుడు రాజై క్రీ. శ. 956 లో మాంగల్లు శాసన మిచ్చియుండును. కనుక పిండిగుండుని (కాకర్త్య గుండ్యని)కాలము క్రీ. శ. 950 నుండి కావచ్చునని స్థూలముగ స్వీకరింపవచ్చును. అప్పటికి మూడు తరముల వాడగు గుండ్యన రాష్ట్రకూటుడొకడు చాళుక్య రాష్ట్రకూటయుద్ధమున మడిసినట్లు కూడ నా శాసనమందు కలదు. ఆ యుద్ధము చాళుక్య భీమునికిని (క్రీ. 892—922)రాష్ట్రకూట- రెండవ కృష్ణునికిని (క్రీ. శ. 878—912) జరిగిన వానిలో నొకటి గావచ్చును. రాష్ట్రకూట రెండవ కృష్ణుని తుది వర్షము క్రీ.శ.

6. Early Chalukyas of Vengi— Dr. N. Venkataramanaiah, P. 185.

912 అని చరిత్రకారులు నిర్ణయించిరి గనుక అప్పటికి గుండ్యన రాష్ట్రకూటుడు (గుండ III) యుద్ధమరణము పొంది యుండును. వీని పుత్రుడగు ఎఱియ రాష్ట్రకూటుడు క్రీ.912–950 మధ్యకాల మందుండెనని చెప్పవలెను. వీని పుత్రుడగు బేతియకు ప్రత్యేక కాలమేర్పడియు చెప్పవీలుగాదు. కాకర్త్య గుండ్యన (పిండిగుండ) పుత్రుడగు గరుడాంకబేతడు ఇప్పటి వరకు మొదటి బేతడని వ్యవహరింపబడువాడు. ఇతడు రేచర్ల బమ్మసేనాని సహాయముతో కాంచీకవాటహరణము చేసి చోడ వరాధిపునిమానమును భంగమొనర్చినట్లు పాలంపేట[7] శాసనమున గలదు. ఈ యుద్ధము కళ్యాణి చాళుక్య రాజైన ఆహవమల్ల ప్రథమ సోమేశ్వరుడు క్రీ. 1052 లో కంచిపై దాడివెడలి నపుడై యుండునని విశ్వసించిరి.[8] కనుక పిండిగుండుని నాటి మాంగల్లు శాసనము తర్వాత గరుడబేతని కీ సంఘటనము జరుగు నాటికి (క్రీ. 956 నుండి 1052 వరకు) సుమారు 100 సంవత్సరము లగుచున్నది. బేతడు చిన్నవాడుగనే బాధ్యతలను వహించినవాడగుటచే కీ. 990 నాటికి పదేళ్ల వాడనుకొన్నను క్రీ.1C52 నాటికి దాదాపు 70 సం.ల వాడై యున్నాడనవలెను. ఆ వయసులో గూడ గొప్ప సేనానుల సహాయముతో నాతడు కాంచిపై దాడి సలిపియుండును. లేదా సేనానులే ఈ దాడిలో పాల్గొని విజయ మాతనిపేర చెప్పియుందురు. కనుక క్రీ. 990 నుండి 1055 వరకు అతని రాజకీయ జీవితముగా చెప్పవలెను. క్రీ. శ. 1079 లో త్రిభువనమల్ల బేతరాజు యొక్క హనుమ కొండ శాసన ముండుటచే క్రీ. శ. 1055 నుండి సుమారు 1075 వర కీతని తండ్రియగు మొదటిప్రోలుని కాలము చెప్పవచ్చును. కాజీపేటదర్గా శాసనమందు తన తండ్రియగు త్రిభువనమల్ల బేతరాజుచే శ. 1012 (క్రీ. 1090) లో రామేశ్వరపండితున కిచ్చిన దానమును త్రిభువనమల్ల దుర్గరాజు క్రీ. 1098 లో పునరుద్ధరించినట్లు తెలియుచున్నది. దీనిని బట్టి త్రిభువనమల్ల బేతరాజు క్రీ. శ. 1090 వరకు జీవించి యున్నట్లు స్పష్టము. లేదా 1098 వరకు కూడ నుండవచ్చును. రెండవ ప్రోలుని హనుమకొండ పద్మాక్షిగుడి శాసనము క్రీ. 1117 నాటి దగుటచే త్రిభువనమల్లదుర్గరాజు క్రీ. 1098 నుండి క్రీ. 1115 వరకు ఉన్నట్లు చెప్పవచ్చును. తర్వాతవారికాలములు చరిత్రకు తెలిసినవేయగుటచే నిచ్చట చెప్పుటలేదు.

2. ఈ శాసనము వలన తెలియవచ్చు రెండవ ముఖ్య విశేషమేమనగా కాకతీయులు రాష్ట్రకూటులనునది. (అ): మాంగల్లు శాసనమున సామంత వొట్టి వంశసంభూతులగు గుండ్యన, ఎఱియలు రాష్ట్రకూటులని కంఠోక్తిగ చెప్పబడిరి. ఇంతవరకు ఆ రాష్ట్రకూట పదమునకు ప్రాచీన శాసనములందు వచ్చు "రాష్ట్రకూట కుటుంబినస్సమాహూయ" ఇత్యాది ప్రయోగములందు వలె సామాన్య కర్షక ప్రముఖులనెడి యర్థము చెప్పుకొనిరి. కాని అది అట్లుగాక రాష్ట్రకూట తెగనే తెలుపునని తోచును. ఆ శాసనము రాష్ట్రకూట మూడవ కృష్ణునిచే చాళుక్య రెండవ అమ్మరాజు క్రీ. శ. 955 లో కళింగ ములకు తరిమివేయబడగా అతనికంటె పెద్దవాడును సవతి సోదరుడును అగు దానార్ణవుడు ఆ కృష్ణుని ప్రసాదమున రాజై మాంగల్లు గ్రామమును దానము చేసెనని తెలుపుచున్నది. దీనిని బట్టి దానార్ణవుడు తన కంటె చిన్నవాడగు అమ్మరాజును రాజ్య భ్రష్టుని గావించుటకై రాష్ట్రకూటుడైనమూడవకృష్ణుని సహాయము నర్థించెనని స్పష్టము. ఆ శాసనము నింతవరకు రెండవ అమ్మరాజాదనుభావముతో కాకర్త్యగుండనాదులను పూర్వ చాళుక్యానుయాయులుగా చెప్పుచుండిరి. కాని నిజమారసినచో మాంగల్లు శాసనము దానార్ణవునిదేకాని తరిమివేయబడిన అమ్మరాజుతో దానికెట్టి సంబంధము లేదని స్పష్టము కాగలదు. దానార్ణవునికి సహాయముచేసినవాడు రాష్ట్రకూటుడైన మూడవ కృష్ణునిచే ప్రేషితుడైన కాకర్త్యగుండ్యన. దానార్ణవుడు చాళుక్యుడైనను తనకు సహాయ మొనర్చిన రాష్ట్రకూట సేనాని యగు కాకర్త్యగుండ్యన కోరికపై మాంగల్లును దానమిచ్చెను. అందా సేనాని తన తాత తండ్రుల ప్రతిభ నుగ్గడించుకొనెను. మొదటివాడగు గుండ్యన రాష్ట్రకూటుడు (మూడవ గుండయ) చాళుక్య శ్రీద్వారమున బ్రవేశించి ప్రాణము లర్పించి తన యజమానియగు వల్లభేశుని (రాష్ట్రకూటుడైన రెండవ కృష్ణుని (క్రీ. శ. 878–912) వాు (విజయవాడ?) ప్రవేశమునకు అవకాశమిచ్చెనట. ఇచట శాసనములోని శ్లోకము చాల తప్పులతో నున్నది. అయినను గుండ్యన రాష్ట్రకూటుడు వల్లభేశుని కొరకు ప్రాణము లర్పించినట్లు స్పష్టముగా నున్నది. ఈ సన్నివేశ మా శాసన కాలమగు క్రీ. 955 నాటికి మూడు తరముల వెనుకటిది. అనగా చాళుక్య మొదట భీమునికిని రాష్ట్రకూట రెండవ కృష్ణునికిని జరిగిన యుద్ధములలో (892–912) నొకటై యుండును. మచిలీపట్టణశాసనమున చాళుక్య మొదటి భీముని (892–922) కొడుకు ఇరిమర్తిగండడు పెరువంగూరు యుద్ధమునందు గుండన నామధేయుడగు నొక రాష్ట్రకూట సేనానిని సంహరించినట్లు చెప్పబడెను.[9] అతడే యీ గుండ్యన రాష్ట్రకూటుడు. (మూడవ గుండయ). అట్లు

7. H. A. S. No. 3.

8. Early History of Deccan: Kakatiyas. P. 578.

9. Early Chalukyas of Vengi– Dr N. Venkataramanaiah P. 25.

తడు తనకై ప్రాణము లర్పించినందుకు ప్రతిఫలముగా రెండవ కృష్ణుడు ఆతని కుమారుడగువిజేయరాష్ట్రకూటుని కుఱ్ఱవాడి దేశమునకు పాలకునిగ నొనర్చియుండును. ఈ కుఱ్ఱవాడి దేశమే నేటి కొఱవి ప్రాంతము. దీని నిప్పుడు కూడ కుఱ్ఱడవి యని వ్యవహరింతురు. ఇది రాష్ట్రకూట రాజ్యమునకు ప్రాక్పిమాంతము. ఇచట చాళుక్య భీముని శాసన మొకటి యుండుట గమనింపతగి యున్నది. కనుక నిది రెండు రాజ్యముల మధ్య గడి స్థానమై ప్రత్యేక పర్యవేక్షణము నపేక్షించుచుండెను. ఇదియే ప్రథమముగా కాకతీయులు తెలుగుదేశమున ప్రవేశించుట యనదగును.

(ఆ): కాకతీయులు రాష్ట్రకూటు లనుటకు మరొక కారణము గలదు. మొదటి ప్రోలుని తర్వాతనే వారిచే వరాహ లాంఛనము స్వీకృతమైన ట్లిందు చెప్పబడి యున్నది గదా! అంతకుపూర్వము వారికది లాంఛనముగాదు. గణపతిదేవుని సేనా నియగు సామన్త భోజుడు కాంచీపురములోని ఏకామ్రనాథా లయమున నొక శాసనము వేయించెను.[10] అందొక కకతి బేతరాజు గరుడ లాంఛనధారియైనట్లు చెప్పబడెను. విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణమునందు నాటకప్రకరణమున (5వ అంకమున 16వ శ్లోకము క్రిందివచనము.) "స్వస్తి కాకతీయకులావతీర్ణాయ సౌపర్ణకేతనాయ మహామహిమ్నే" అని కాకతీయులకు గరుడధ్వజముండుట స్పష్టముగా చెప్పబడెను.[11] ప్రస్తుత బయ్యారపు శాసనములో పిండిగుండని పుత్రుడు "గరుడాంక బేత నృపతి" తన్నామవాహోన్వయాత్" అని కంఠోక్తిగా చెప్పబడెను. ఇంక నేటికిని చిక్కు విడని గూడూరు శాసనములో తెలుగు భాగమునందు "కమవసాని యొక మేల్గరుండని బేత భూవిభుని కాకతి వల్లభు చిన్నవాని.." అని కామవసాని పిన్నవాడగు గరుడబేతని చాళుక్య చక్రవర్తి యొద్ద పరిచయము చేసినట్లున్నది. ఇంతవరకు రాష్ట్రకూట సామంతులుగ నున్నవారు ప్రథమముగ వారి శత్రువగు చాళుక్య చక్రవర్తిని సందర్శించుట తెలుపబడెను. కామవసాని యప్పటికే వారి యనుయాయినియగుటంజేసికాబోలు నామె యీ బాలుని చక్రవర్తి యొద్దకు గొంపోయెను. అది తూర్పు చాళుక్య రాజ్యము జటాచోడ భీమునిచే నాక్రమింపబడినట్టియు, పశ్చిమమున రాష్ట్రకూట ప్రభుత్వము చాళుక్య రెండవ తైలపునిచే కూలద్రోయబడినట్టియు సంధికాలము. (973–1000). ఈ యదనులో వృద్ధుడైనను పిండిగుండడు కొఱవిలో స్వతంత్రించి యుండును. అతని యనంతరము బాలుడగు గరుడ బేతడు తండ్రి సంపాదించిన స్వాతంత్ర్యము కోల్పోవుటయు, విరియాల వంశమునకు చెందిన ఎఱ్ఱనృపుడు అతని భార్య కామవసాని, వారి కొడుకు సూరుడు వానికి సహాయముగా వచ్చి తుదకు చాళుక్యరాజుల క్రింద సామంతునిగ కాకతిబేతని నిలబెట్టుటయు, ఈ గూడూరు శాసనభాగమందు వర్ణింపబడినవి. కనుక కాకతీయులది ఆద్యమున గరుడ లాంఛనమని నిర్వివాదముగ తెలియుచున్నది. రాష్ట్రకూట రాజులకును, వారి సామంతులగు నితర రట్టాన్వయులకును, గరుడధ్వజముండుట ప్రసిద్ధము. కనుక కాకతీయులు గూడ నేదో యొక సామన్తరట్టాన్వయమునకు చెందియుందురు. చాళుక్యసామంతులైనపిదపనే వారిలో కొంత పరివర్తనము కలిగెను. వారు శైవదీక్షను స్వీకరించుట కూడ తర్వాతదనియే చెప్పవలెను. రెండవప్రోలునితరువాత వారికే శైవనామధేయములుండుట గూడ గమనింపదగును.

## వారి వంశమును గూర్చి:

సామన్తవిష్టి వంశమని కాజీపేట[12] దర్గా శాసనమందును, సామన్త వొట్టికులమని[13] మాంగల్లు శాసనమందును చెప్పబడెను. వృష్ణి వంశమునకు చెందిన రట్టాన్వయులు కొందరు గలరు. దాని వికృతి రూపమే విష్టివంశమేమో తెలియదు. క్రృష్ణ శబ్దము, కిష్టయ్య, కిట్టయ, మున్నగు మార్పులొందినట్లు. వీరి క్షత్రియత్వమును గూర్చి కూడ వాదోపవాదము లెన్ని జరిగినను నిశ్చితాభిప్రాయము వెలువడదు. ప్రధాన రాష్ట్రకూట వంశమును గూర్చియే అది తేలనపుడు, వీరిని గూర్చి అదెట్లు సాధ్యమగును? వారెట్లు రాజధర్మమునుబట్టి క్షత్రియులైరో, వీరును గౌణముగనే క్షత్రియవాచ్యులు. మైలాంబిక వరాలోచనా సందర్భమున నతవాటి రుద్రుడు "కన్యాసవర్ణః" అని చెప్పబడుటను బట్టియు, కాకతీయులకు నతవాటి వారితో వివాహ సంబంధములు ప్రోలుని నాటనుండి యున్నట్లు తెలియుటచేతను నిద్దరునొకే తెగకు చెందినవారనిపించుచున్నది. నతవాటిరుద్రుని కూతురగు బయ్యమాంబయొక్క అమరావతి[14] శాసనములో నతవాటివారు స్పష్టముగా చతుర్థకులజులని చెప్పబడిరి. వారు కూడ రట్టాన్వయులేమో తెలియదు. మహాదేవుడు రెండవ కుమార్తె యగు కుందాంబను గూడ నతవాటి రుద్రుని కేల యిచ్చెనో తెలియదు.

---

10. Indian Antiquary. XXI. P. 200.

11. నాకీ విషయము తెలిపిన శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిగారికి కృతజ్ఞుడను.

12. Corpus of Telingana Inscriptions Part 2. Page 25.

13. E. P. Indica Vol. XXXI P. 42. Text. line: 35.

14. E. P. Indica Vol. VI. P. 157.

# కాకతి మైలాంబ బయ్యారం చెఱువు శాసనము

## కాకతిపురమును గూర్చి :

కందారపురము నుండి కాకతీయులు వచ్చినట్లు సిద్ధేశ్వర చరిత్ర తెలుపుచున్నది. నాందేడు జిల్లాలో కందహారు అను గ్రామము చరిత్రలో సేన్దన్తి రట్టాన్వయులకు కొంతకాలము రాజధానిగ నున్నట్లు తెలియుచున్నది. కాకతమ్మకు పైదొడ్డైన యేకవీర ఆ ప్రాంతములో బాసర్ అను (నాందేడు జిల్లా సరిహద్దులో ఆంధ్రప్రదేశములోని కడపటి గ్రామము) చోట నేటికిని పూజింపబడుచున్నది. కనుక కందహారులో పూర్వము కాకతమ్మ యుండెననుటలో నాశ్చర్యములేదు. ప్రస్తుతమున్నదో లేదో తెలిసికొనుట జరుగలేదు. అదియే వీరి మూలపురుషుడైన వెన్నన్నపుడు పాలించిన కాకతిపురమై యుండవచ్చును. వీరితో బాటు కాకతమ్మ కూడ ఆంధ్రదేశమునకు విచ్చేసియుండును.

## స్థలనిర్దేశము :

కాకతినగరము ప్రస్తుతపు నాందేడు జిల్లాలోని కందహారు కాగలదని లోగడ సూచించియుంటిని. ప్రమాణాంతరము లభించు వరకు దీనిని గూర్చి నిర్ణయింపజాలము. కుఱ్ఱవాడి ప్రాంతమునకు వెళ్ళినప్పుడు రాజైనట్లు దీని యందు కలదు. ఇది వరంగల్లు జిల్లా మహబూబాబాదు తాలూకాలోని కొరవి సీమయని చెప్పవలెను. గూడూరు శాసనములో గిరుపజేతని స్థానముగ చెప్పబడినది కూడ నిదియే. ఇచట నుండి అతడు అనుమకొండకు ప్రథమముగా తన కేంద్రమును మార్చెను. బయ్యార గ్రామము, చెఱువు ముందుగ చెప్పబడెను. మైలాంబ తన తల్లియగు బయ్యలమహాదేవి పేరిట నిర్మించిన గ్రామమిదియే. తండ్రి పేర నిర్మించిన మహాదేవపురము, తన గుణనామముతో నిర్మించిన ధర్మకీర్తిపురము ప్రస్తుత మీ ప్రాంతమున తెలియవచ్చుట లేదు. మైలాంబ యొక్క స్వనగరముగా చెప్పబడిన ఇనుగురికి పై చెప్పబడిన మహబూబాబాదు తాలూకాలో కేసముద్రమునకు సుమారు 10 మైళ్లదూరమున కలదు. అచట కూడ నీమె శాసనములు కొన్ని కలవు.

1. (శ్రీ మహాదే)వాయనమః॥ దంత ప్రభామండలి మాత్మతుండ......
2. (.........)మూర్త్త మివ ప్రసాదం। తం దంతి వక్త్రం హృది చింతితార్త్థప్రదం
3. (సదా)శేషనుతం నతోస్మి॥ (1*) స్వప్రీతి సాపత్న్య క్రుధిత మనసే వాంబునిధినా
4. మహాంభ స్సంభారే ధరణి దయితాం క్వాపి నిహితాం। సమున్వి ష్యో
5. ద్వాహ్యా ప్రచురతర రోమాంచ రుచిరో హరేః క్రీడాక్రోడో జయతి
6. జగదానంద జననః॥ (2*) స్వతను మపి దదామి ప్రార్త్థితానా మర్త్థియే
7. భ్యః కిముత పర మితి వా వేదయ న్నాదరేణ। శిఖరిపతి సుతాయై
8. దత్తవామార్ద్ధదేహ స్సుఖయతు నిఖిలానా మాశితా శంకరో వః (॥) (3*)
9. శ్రీ విష్ణు నాభీ సరసీ సరోజ మధ్యే జనిర్ద్విజ రజోనుషక్తః। వాచా మధీ
10. శో జగతాం ప్రసూత్యై హిరణ్యగర్భ స్సనువర్త్త తాగ్రే॥ (4 ) యద్వా గ్వదం
11. తీ కురుతే ప్రసాదం యస్మి న్స విద్యాసు సరస్వతీవ। ప్రభు ప్రసాదస్య ఫ
12. లం తదేవ యదాత్మ సామ్యం లభతే స్వదాసః॥ (5*) తద్వాహు తేజో మా
13. హాత్మ్యా జ్జాతా రాజన్య సంతతిః। క స్తత్ర విస్మయ స్సోపి పురుషాం
14. (గా)ద్వినిర్గ్గతః॥ (6*) తత్రైవ దుర్జ్జయో నామా రాజా భూ ద్యోగి కాభిధః। య
15. (న్నామ) శ్రవణాదేవ వైరిణ స్త్రిణదండినః॥ (7*) తదన్వయే వెన్న నృపో బభూవ
16. (ను)త స్సద సన్నత వైరి భూపః। యః కాకతిస్థః పృథివీం శశాస తే నా
17. (న్య) వంశ్యా అపి కాకతీశాః॥ (8*) తత్పుత్ర పౌత్ర నప్తారః క్రమశో గుం
18. డ సంజ్ఞకాః। జాతా: ఖ్యాతాః నృపాః పృథ్వ్యాం రామత్రితయ విక్రమాః॥ (9*)
19. ఎఱ్ఱనామ నృపతి శ్చ తత్పరః కుఱ్ఱవాడి ముఖ సర్వ్వ దేశపః। పిండి
20. గుండ నృపతి స్తతో భవ ద్ధ(ఖ)ండితారి నరనాథ మండలః॥ (10*) జాతో స్మా
21. ద్గరుడాంక బేత నృపతి స్తన్నామ వాహాన్వయా త్ప్రఖ్యాతః క్షితి మ(ం)
22. డలే గుణనిధి ర్భూపాల చూడామణిః। హత్వా యో నుమనామ
23. ధేయ మహితం కొండంచ చక్రే పురం విఖ్యాతానుమకొండ
24. మూర్జ్జిత యశః కర్ప్పూర భాండోపమం॥ (11*) తస్మా త్ప్రోలక్షితీశో
25. భూ త్ఖ్యాతారి గజకేసరీ। యః కేసరి తడాగం తం చక్రే భూ
26. చక్ర వల్లభః॥ (12*) తే నోద్ధృతా భూ స్సకలాస్మ దీయే త్యాఖ్యాతు కా
27. మై రివ భూమిపాలైః। యద్వంశజై స్స్వర్ణ్ణ గవాదికేషు వరాహ
28. ముద్రా విహితా కృతజ్ఞైః॥ (13*) జాతో స్మా త్రి(త్రి) భువనమల్ల భూమి పా
29. లః ప్రాలేయ ద్యుతి విశద ప్రభూత కీర్త్తిః। శేషాహి ప్రతిధరణీశ
30. వాసవానాం యన్నామాక్షర తతి రేవ భీతిహేతుః॥ (14*) తత్పుత్రః
31. ప్రోల భూప స్త్రిభువన వినుత స్ఫార సార ప్రతాపః కందర్ప్ప స్స
32. ద్ర రూపః ప్రథిత పృథుతర స్వాన్వయైక ప్రదీపః। య(ః)స్ఫీతాశ్చర్య్య
33. శౌర్య్యః ప్రతిముఖ నృపతీ న్నిర్జ్జితా నూర్జ్జితశ్రీ ర్బర్ద్ధయ స్తుంగై
34. స్తురంగై ర్గ్ఘటయతి నిజదోర్ద్దండ కండూం వినేతుం॥ (15*) త
35. స్య శస్య మహసో మహీపతే రాత్మజేషు బహుషూదితేష్వపి।
36. విశ్రుతా వభవతా ముభౌ సుతౌ రుద్రదేవ మహదేవ భూపతీ
37. ॥ (16*) ఏక స్తయో రధిపతిః క్షితిపాలకానాం ధీమా నమానుష బ
38. లః కిల రుద్రదేవః। యం వైరి నీరనిధి నిర్మ్మథన ప్రగల్భం హర్షేణ
39. పూరుష వరం స్వయ మాప లక్ష్మీః॥ (17*) మాన్య స్తదన్యో థ రిపుప్ర
40. మాథీ మహీ మహేంద్రో మహదేవభూపః। సమస్త సామం
41. త శిఖామణీనాం గణ్యై స్సముత్తేజిత పాదపీఠః॥ (18*) యః కర్ణ్ణ
42. స్య విదీర్ణ్ణతాం సమతనో న్నానార్త్థ దానోద్యతః శ్చ(చ)క్రే శక్రనిరాకృ
43. తిం నిరుపమై శ్వర్య్యైక భూమి ర్బ్బలేః। కందర్ప్పం గతరూప దర్ప్ప
44. మకరో ల్లావణ్య పుణ్యాకృతిః క స్తం వర్ణ్ణయితుం కవి ర్బ్బు
45. వి మహాదేవక్షితీశం క్షమః॥ (19*) క్షోణీ నాథస్య తస్యా భవ దతి
46. విభవే భక్తిభాజః పురారౌ గౌరీసేవానురక్తా ప్రియతమ మహి
47. షీ బయ్యమాంబాభిధానా। యా సా సౌభాగ్య సీమా తిలక వి
48. రచనా శేషయోషా జనానాం భూషా విశ్వంభరాయాః కుల గృ
49. హ ముచితం భామినీ సద్గుణానాం॥ (20*) తన్నందనో జయతి చంద
50. (నచా)రు కీర్త్తి(ః) శ్రీణా మివోదితగణో గణపత్యధీశః। దుష్టేషు శి
51. ష్ట) నికరేష్వపి చ క్రమేణ య స్సందధాతి నిధనం చ ధనం చ సద్యః॥ (21*)

# కాకతి మైలాంబ బయ్యారం చెఱువు శాసనము

52. (.......) థాస్యాం విదితనృప మహాదేవత స్సుగ్రహోఢ్యై
53. (.........శాకేశ) రక్ష శివమితే శోభ కృత్సంజ్ఞవర్షే। లోకానంద్యై
54. (......)వచన శతై ర్ద్విజక్రసత్యాబ్జనాద్యై ర్దేవానాం పుష్ప
55. (వృ......) ఖిల శుభ్రైః కన్యకా కాపి జజ్ఞే॥ (22*) శ్రీపర్వతేంద్ర శిఖర
56. యుత (లో)కవంద్య శ్రీ మల్లికార్జున సమాహ్వాయపి పితృభ్యాం।
57. (అన్య) చ్చ ధర్మనిపుణై ర్మర్త్యహనీయ కీర్త్యా సా ధర్మకీర్తి గుణవ మ (రిలినామ)
58. (.....)రం జగామ ॥(23*) ఖ్యాతే మేనాపతి గిరిసుతే స్వత్ర మైనక గార్య్యే
59. (క్షి) రాబ్ధే రప్యుదిత తనయే ష్విందు లక్ష్మ్యోచ యద్వత్। శ్రీబయ్యాం
60. బా ప్రియతమ మహాదేవరాజాత్మజానాం విఖ్యాత శ్రీ గణపతి వి
61. (భు) మైలమాంబా చ తద్వత్॥ (24*) ప్రాజ్యం రాజ్యం ప్రకుర్వ న్నువి కటకపు
62. (రీ) చూరకరాంక సిద్ధః పుత్రోద్వాహం విధాయ త్రిభువన (వి)
63. (ను) త శ్రీమహాదేవభూపః। అహహా యామాత్యవర్య న్న
64. (వ)ది గుణయుతా స్వస్యకా యా వరః కః పృథ్వ్యా మైలాంబి
65. (కా) యా ఇతి స గదితవాన్ తేపి తస్యైవ మాహుః॥ (25*) ఆంగ(ః)స్వాం
66. (గ) వరాయణో ల్పవిపంః నా వాంగోపి దోషోద్భవః కాలింగ
67. (స్స?) చ న మతోపి కటకారతి శ్చ చోడో నృపః। దృశ్యా దశనభాగి
68. నో నృపతయ శ్చాలుక్య వంశోద్భవః వోగిణ్య స్తవ సైవణో గిరిచరో
69. (ధా) రాశ్రయో మాలవః॥ (26*) తథాపి మాతా తవ ముప్పమాంబా దు
70. (గ్ధ) క్షితీశస్య సహోదరా సా। శ్రీనాతవాడీశ్వర వంశజాత స్త్వన్మాతులో
71. వక్కడిమల్ల నామా॥ (27*) తత్సూను శ్శిడిక్కిలుపాత బుద్ధ భూపః ప్రఖ్యాత
72. స్వకలరిపు ప్రమాథి కోపః। సంగీత ప్రభృతి వినోద సౌఖ్యమూ
73. ర్తి స్త్యాగీ సన్ త్రిభువన మధ్య వర్తి కీర్తిః॥ (28*) రాజ్ఞ స్తస్య ప్రియా ప
74. త్నీ ముప్పమాంబా పతివ్రతా। సత్పుత్ర రత్నగర్భా సా లలితాం
75. గీతి విశ్రుతా॥ (29*) తన్నందనః కాంత కుమార రుద్ర(ః)శూరః కలా
76. వా నకలంక చంద్రః। యువా సువాసా భువి కర్ణ కీర్తిః కన్యా
77. సవర్ణః కుసుమేషుమూర్తిః॥ (30*) శూరో ప్యార న్నిజగురుజనా దేతి
78. భీతిం సమగ్రాం త్యాగీ సన్న ప్యయతి నియతం లుబ్ధభావం గు
79. ణేషు। సత్యం వాగ్మి తదపి వచనం న నృతం ఎక్కు మీప్యే లోకోత్కృష్టో
80. గుణనిధి రయం రుద్రదేవాభిధానః (31*) ఏషాచ కన్య చలమర్తి
81. గండ రాజ్ఞాం తపశ్శ్రీః ఫలితేవ భాతి। నూనం స్వవంశ్యా నృపతివంశ
82. జాంశ్చ సంవర్ధయిష్య త్యఖిలాం సులక్ష్మీ॥ (32*) కన్యా సక్కా మైలమా
83. హ్వాంబికేయం సోయం సత్యం రుద్రదేవో మహేశః। ఇత్యుక్త్వా సై
84. భూర్వామిపాల స్తయో ర ప్యుహోద్వాహం కారయామాస రమ్యం॥ (33*)
85. శృంగార స్త్రీపు హాస్యం నటవిట విలస ద్వందిబృందే కృపా భూ ద్దీ
86. నానాథేషు రౌద్రో విఫల నృపతతౌ త్యాగ శౌర్యం(యే)చ భీతిః! సా
87. పేభ్యో హేయతా చా నృతవదనవిధౌ వాద్యఘోషే ద్భుతం త చ్చా
88. న్త్ర్య న్ప్రేషు చైవం నవరస భరిత స్తద్వివాహోత్సవో భూత్॥ (34*) సేయం
89. శ్రీరుద్ర దేవా ద్బహు విధ నిధిభి(ః) శ్రీమహాదేవ గేహై శ్చిత్రై ర్నవా
90. వనాఘైః కుసుమిత ఫలితై శ్శస్య సస్యై స్తడాగైః దృష్ట్వా దృష్టార్థ
91. కామై ర్ద్విజ ధవల గృహై రాత్మజానాం ప్రజానాం వింశత్యా సైకయైవ
92. వం పలిత లలిత సత్సప్త సంతాన కీర్తిః॥ (35*) భాగ్య సౌభాగ్య లావణ్య
93. వివేకా న్నృహూ సంశ్రయాన్। ప్రష్టుద్రష్టు మి వైకత్ర యాం చక్రే
94. వక్రకుంతలాం॥ (36*) ఏకైకావయవ విశేష వర్ణనే స్యాః క శ్శక్తః క
95. వి రపివాద చారు మూర్తేః। యత్రాంశే కిల కలితా స్తదం
96. గ రంగే తత్రైవ స్తిమితతరా దృశో జనానాం॥ (37*) ఆస్యేయస్యాః
97. ప్రకామం వికసిత కనకాంభోజవద్భ్రాజమానే పద్మా పద్మాల
98. యాఖ్యాం కలయితు మివ సా సంతతం సన్నివిష్టా। యస్మై
99. (...షి) ప్రసరణ సరణిం ప్రాప విద్యావ

100. క్షిప్రమేవ ప్రతిహత విపదో భూతలే స్మిన్నవంతి॥ (38*) రేఖాకారం నిజ
101. కరతలే బిభ్రతీ చారు పద్మం పాదన్యాసై ర్విధివర మధః కుర్వతీ
102. పద్మమేవ। లక్ష్మై లక్ష్మై గణపతి శశాంకను జేయం జానాం చేత స్వా
103. త్యర్థ వృద్ధధి మథన శంకి నూనం కరోతి॥ (39*) తావ ద్భ్రువాం చంచ
104. లత్ప్రవాద స్తావ త్ఫలన్యయః విజృంభణాని। తావ ద్రూపిద్వా
105. న్య వదాన్య వార్తా యావ న్న జాతా భువి మైలమాంబా॥ (40*) నైవ సా
106. నగరీ భాతి న సా సంప న్న సా కథా। యత్ర ధాత్రీ విభూషేయం
107. మైలాంబా నైవ వర్తతే॥ (41*) సేయం ప్రఖ్యాత రుద్రనుజన్నృప త
108. నయా భద్రరుద్రాగ్రజన్మా విఖ్యాతా రుద్ర[illegible] బహుతరస
109. గుణా రుద్రదేవస్య పాతా। రుద్రాణీశస్య భక్తా నిజపతి వసు
110. ధాధీశ రుద్రానువృత్యా రాజ్యం ధర్మైకస్స హిస్మే న్నతస వితను
111. తే శంభు రుద్ర ప్రసత్త్యై॥ (42*) ధర్మకీర్త్యా యయా ధర్మాః కలౌ కా
112. తే వలంబతః। మన్యే హం మన్యతే సుస్థో నైకపాదస్థితి వ్యథాం॥ (43*)
113. విప్రాణా ముపనయనాని తద్వివాహా న్తత్కార్య క్రతునివహా
114. క్రియా ప్రబంధాః। మైలాంబా బహు విధ దత్త విత్త భారై ర్వర్తంతే
115. తదను యశః ప్రవర్తయంతి॥ (44*) యత్కృపాణాం ప్రపాదీనాం
116. సంఖ్యా ఖ్యాతాస్తు పుస్తకైః। తదావృత్తి క్రియే యత్తా కవినా
117. కేన వోచ్యతే॥ (45*) గ్రామే గ్రామే విబుధ భవనం యత్రతత్రా న్నశాలా
118. మార్గే మార్గే వనవిరచనం యత్రతత్ర ప్రపాళి స్థానే స్థానే బహు
119. జలధృతి ర్యత్ర తత్రా గ్రహారః ప్రాయేణైవం భువిని సుకృ
120. తే కరణం మైలమాంబా॥ (46*) అఘౌఘ నిర్దానన ధూమకేతౌ సే
121. తౌ సముద్రస్య హరస్య గేహం। యా నిర్మమే నిర్మల ముస్నతా
122. గ్రం స్వకీర్తి వల్లే రివ గుచ్ఛ మచ్ఛం॥ (47*) అభ్రంలిహం శుభ్ర మదభ్ర
123. తానం శ్రీపర్వతే శర్వ నికేతనం యా। చకార కైలాసధియేవ
124. యత్ర క్రీడాం మృడనీ పతి గతనోతి॥ (48*) కాశీపురే పురరిపో
125. ర్నగరం గరీయః కుందేందుశోభి విదధే విబుధైర్నుతం యా।
126. య-త్కాంత కాంతి లహరీభి రభిప్లుతేవ సా జాహ్నవీ జయ
127. (తి) శారద వారిదాభా॥ (49*) స్వస్యా మినుంగు జేకి పుర్యా మి
128. యమమిత గుణా శంభు వ చ్చంద్రచూడం కైవల్యోద్యోగి
129. తుల్యం ద్యుమణి నిజతను స్పృష్ట మస్పృష్ట ఖేదం। ప్రాసాదం
130. కారయిత్వా రజత శిఖరివ త్పార్వతీశాధివాసం స్వస్యా భ
131. ర్తు శ్చ నామ్నా వ్యతనుత శివయో ర్భూరిపరిష్మాం ప్రతిష్ఠాం॥ (50*)
132. భర్తా ధిక్రి (క్కృ) త శక్రవిక్రమ కథః ప్రాజ్యం చ రాజ్యం కులం
133. వీరోదార నృపాకరస్స భగవాన్ దైవం భవానీ పతిః। పుత్రా శ్చి
134. త్ర చరిత్ర భూషణ భృతో యస్యాః ప్రశస్యం వపుః కీర్తిః కా
135. ర్తిక చంద్రధామ ధవలా సైషా కథం వర్ణ్యతే॥ (51*) మాతు ర్బర్యాం
136. బికాయాః పితు రపి మహదేవావనీనాయకస్య స్వస్యాశ్చ వా
137. (భి) ధానైః పురనికర మియం మైలమాంబా విధాయ। భూ
138. యో భూమండల స్థాఖిల నృప నగర గ్రామశోభా విశేషై
139. ర్యుక్తాం చక్రే వరిష్ఠాం పుర మిహ మహతీం ధర్మకీర్తి స్వ
140. నామ్నా॥ (52*) క్వచి న్నానాదేశా దుపగత జనో ల్లాఘనవిధిః క్వచి
141. ద్దీనానాథ వ్రజ కశిపు విశ్రాణన గృహాః। క్వచి ద్వాహో రోహః
142. క్వచి దపిచ కావ్య వ్యతికరః క్వచిత్సంగీతశ్రీ రిహ ముద ముదగ్రాం
143. విదధతి॥ (53*) ధర్మ కీర్తి పురహర్మ్య మండలీ చ్ఛాయయా పహ్ను
144. త లాంఛన శ్శశీ। తత్సమస్త నగరీ ప్రశస్తతాం చ్ఛత్ర మచ్ఛ మి
145. వ సూచయ త్యలం॥ (54*) సువర్ణ సంప్రదచితాంగ భూషా పయో
146. ధర డంబర సంభృతశ్రీః। కలాభి రానందకరీ పురీయం మన
147. స్సమాకర్షతి కామినీవ॥ (55*) సవేద ఘోషం చతురాననేను సదా

148. సమీపస్థిత రాజ హంసాం హిరణ్యగర్భ......................
149. వృత్తి మిమాం పుణ్యకృత (?) ప్రశంసంతే॥ (56*) సా కా.......... .. .. . . .
150. ర్త్యం చిత్రం మహీతలే। యావ ద్యావ ద్యద స్యా.................. .....
151. న వర్తతే॥ (57*) నిత్యప్రతిష్ఠాపిత దేవగేహ వ్యాపా......................
152. ర్యశైలా యేన స్పర్ధతే సాన్విత మహిమా కాన్త కైలాసయా................ .....
153. పురయ్యా॥ (58*) మస్త ప్రభా భాసురవేశ్మ లక్ష్మీ ప్రాసాదానాం...................
154. యేషాం యస్యాం జహే: కుట్టిమ చంద్రకాంత నిష్యంద.........................
155. బ(వ)లక్ష పక్షః॥ (59*) నిర్మాణాయ రమణీ మనసా నిధాం .... .. ...............
156. ర్మ కీర్తి గణనామ పదం దధత్యా। మైలాంబ యేహ సుసరో
157. రసరో గణాయ స్వేనాహ్వయేన విదితో విహిత స్తడాగః॥ (60*) మైలాం
158. బికామానస దర్భిరో విస్తారవత్త్వ స్తదపి సమానః। తదీయ
159. వాక్ఛీ రుచిమ ద్గుణోయ స్తద్వ్యా। ద్ర్పస్వా జనోపభోగ్యః॥ (61*) యశ్చార
160. శ్చిరు సేతునాంబరతలం సస్మైః ప్రశస్త్రా[illegible]మిర్మహో[illegible] కుల్యాభిః క
161. కుభో భుజంగ భవనం గాంభీర్య[illegible] తత్త్వ[illegible]
162. ధాభ[illegible]స్వర్గాణ వనిముఖ్ఖల వ్యాప్య[illegible]సా నర్మద[illegible]
163. వ్యాప్నోతి విశ్వాత్మవత్॥ (62*) ఉత్సా[illegible] బుద్ధ్వా ప్రభుతా గుణాఘునతా వ మై
164. లాంబికయా సమానః। ఉద్బోషయా న్నిత్యయ మూర్మిణా హస్తై రా
165. హంతి శక్రా మివ సేతుపాలిం॥ (63*) యథా యథా నిర్మల ధర్మ కీర్తేః స్ప
166. ముస్సలిం యాతి తడాగసేతుః। తథా తథా మత్సరిణాం నృపాణాం
167. ప్రయాంతి వక్త్రాణి వినమ్రభావం॥ (64*) వింధ్యాద్రిః కిము కుంభ సం
168. భవ మునే రాజ్ఞా ప్రతిష్టంభిత స్త్యక్త్వాకార మిహాభిరోపకృత
169. యే వర్ధితాస్మ మన్యం ప్రీతః। భూతానా మభయాయ బాహు
170. రథవా పాప్తప్రసారః క్షితే రిత్యాతర్కిత సేతు రేషి హృదయం
171. నిధ్యాయతాం యో నృణాం॥ (65*) సేతౌ యస్య ప్రశస్యేస్మిన్ రుద్రాబ్ధి
172. లఖ వర్మని। సత్యం సతతగాత్యా సన్ ఖేచరా అపి భూచరాః॥ (66*)
173. వితత్పురీ నివసన స్థిరచిత్త వృత్తిం లక్ష్మీం విరంతర దిదృక్షు ర
174. హ మక్షకః। శ్రీ ధర్మ కీర్తి జలధి వ్యపదేశ శాలీ మన్యే కిమస్య ది
175. హ సంప్రతి సన్నిధత్తే॥ (67*) శ్రియః ప్రసూతిః శ్రుతదస్య జనకో హ్యమ్బు
176. తస్య భూః। స్పర్ధతే వార్ధినా యస్తు దేవైరపి నలోద్భుతే। (68*) యత్రో
177. ద్భూతే క్షితితలే విశదం ఖనిత్వా గోదావరీ స్థగిత గుద్ధనదీద్ధ పే
178. తోః। శేషాహి నీలమణిభూరి శిరాంసి భాంతి భృంగాః సే
179. వ్యసితపద్మ వన చ్ఛలేన॥ (69*) యస్మిన్ దిక్కరిహస్త ధూనసముద్భూ
180. తా స్తరంగా భృశం తద్దలాస్ఫ్యణ జలై స్సమా స్సురగణాయాకాశగంగా
181. గతాః। నక్షత్రాణి చ భాంతి కూర్మణ శిరసి ప్రక్షిప్త పుష్పాంజలి
182. శ్రీకాశీవ సురైః కిమత్ర బహునా త్రైలోక్య మేకీకృతం॥ (70*) శ్రీ ధర్మ కీ
183. ర్తి యుత మైలసముద్రనామ్నా హేమ్నా తడాగ వర వీక్ష క్షిత స్వభూ
184. మ్నా। అమ్నాయ వేద్య విభవస్య రమేశ్వరస్య సామ్నా స్తుతస్య శయనాబ్ధి
185. సమ స్పదాస్తు॥ (71*)




**అమృతాంజనం** వాడి

**శీఘ్రంగా నివారణ పొందండి**

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరకే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహౌషధం.




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

# న్యాయం

శ్రీమతి ఆర్. వసుంధర

సెషన్సు కోర్టులో సుబ్బయ్య హత్యానేరం విచారణ జరుగుతోంది. ముద్దాయి సుబ్బయ్య కొడుకు రామకృష్ణ. రామకృష్ణ క్రొత్తగాపెట్టిన కాలేజీలో జవాను.

మూడేళ్ల వయస్సులో తల్లిని పోగొట్టుకొన్న రామకృష్ణను తానే తల్లీతండ్రీ అయి పెంచాడు సుబ్బయ్య. ఫిఫ్తుఫారం దాకా చదివించాడు. తరువాత పెళ్లి చేశాడు. పెళ్లి చేశాక కూడా సుబ్బయ్య బాధ్యత తీరిపోయిందని చేతులు దులుపుకోలేదు. చదువుకున్న వాడై యిటు కూలిపనీ చెయ్యలేక అటు ఉద్యోగమూ దొరక్క వుండిపోయిన కొడుకుని పదేళ్లపాటు కూర్చోబెట్టి పోషించాడు. తరువాత రామకృష్ణకు ఉద్యోగం దొరికింది కాలేజీలో జవానుగా. సుబ్బయ్య ముసలివాడై పోయాడు. వృద్ధాప్యంతో నిష్ప్రయోజకుడైన తండ్రిని, యింతకు ముందు తన కోసం ఎంతో కష్టపడ్డాడన్న విషయం విస్మరించి, కోపంతో తల గోడకు వేసి పగులకొట్టి చంపాడు రామకృష్ణ. ఈ విషయం రామకృష్ణ భార్య మొదట్లో పోలీసుల కిచ్చిన స్టేట్‌మెంట్‌లో స్పష్టంగా వుంది. ఇరుగుపొరుగు వారి సాక్ష్యమూ వుంది. ఇటువంటి కృతఘ్నుణ్ణి, పరమ కిరాతకుణ్ణి ఏం చేసినా పాపంలేదు. ఉరిశిక్ష ఒక్కటే వీడికి తగిన శిక్ష. ఇటువంటి రాక్షసుల్ని సంఘంలో నుంచీ వేరుపురుగుల మాదిరి ఏరివేసి నాశనం చెయ్యాలి. ఇది ప్రాసిక్యూషన్ వారి వాదన.

సుబ్బయ్య తాగుబోతు. అన్ని వ్యసనాలూ వున్నవాడు. చిన్నప్పటి నుండీ రామకృష్ణను తల్లీదండ్రీ తానేయై పెంచాడనేది సత్యాబద్ధం. మేనత్త నాగమ్మ యింట్లో యింత తిండి తిని, యింటికి వెళ్లగానే తాగివున్న తండ్రి ఏ మిష మీదనో చితక తంతాడనేది తథ్యం గనుక, భయపడుతూనే విధిలేక యిల్లనే నరకంలో ప్రవేశించి తన్నులు తింటూ పెద్దయిన వాడు రామకృష్ణ! విధి చేత చాల చిన్నచూపు చూడబడిన అభాగ్యుడు. ఏ విధమైన అపేక్షనూ ఆప్యాయతనూ ఎరుగక లోకంలో వుండేది తిట్లూ దెబ్బలూ మాత్రమేననే అనుభవంతో పెరిగినవాడు. ఎప్పుడూ ఎవరికీ ఎదురు మాట చెప్పడు. అందరూ ఎదురుగానూ చాటుగానూ 'మందమతి' అని వ్యవహరిస్తుంటారు. మూడో క్లాసు చదువుతున్నవాడిదగ్గర్నుండీ చదువు సంధ్య లేక రోడ్ల మీద తిరిగే రౌడీల వరకూ అందరికీ రామకృష్ణంటే ఎగతాళే! వట్టి మొద్దు, మూర్ఖుడు. ప్రిన్సిపాలుగారూ, లెక్చరరు గారూ రామకృష్ణ తప్పు చేసినప్పుడు 'మొద్దూ' అనీ 'స్టుపిడ్' అనీ పిలిచి తిడుతుంటారు. దేనికీ ఎవరికీ ఎదురు మాటనేది చెప్పడు. ఎవరేమన్నా అది తనకు తగినదేనన్నట్లుగా ఉదాసీనంగా వుంటాడు. తనతో పాటుగా చేరిన జవాన్లు ఏడోక్లాసు పాసయిన వాళ్లు ఎటెండర్లుగా తనకంటే ముందుగా ప్రమోషన్ తెచ్చుకుంటే పదోక్లాసు చదివిన రామకృష్ణ యిదేమని అడగలేదు. ఇంత ప్రపంచంలోనూ అట్టడుగుకు తొక్కివేయబడి నిర్దాక్షిణ్యంగా నలిపివేయబడటం, తనకు విధి నిర్దేశించిన సహజమైన పాత్ర అని మనసులో గట్టిగా నాటుకుపోయిన రామకృష్ణ, తండ్రికి ఎదురుతిరిగి త్రోసి చంపాడనేది నమ్మతగిందిగా లేదు. సుబ్బయ్యే తాగివచ్చి మైకంలో తూలి గోడకు తలకొట్టుకున్నాడు. ప్రాసిక్యూషన్ కథనం వట్టి కల్పితం. పోలీసులు అమాయకురాలైన రామకృష్ణ భార్యను బెదిరించి భయపెట్టి ఆ స్టేట్‌మెంట్ తీసుకున్నారు. తరువాత ఆమే నిజమైన రెండో స్టేట్‌మెంట్ యిచ్చింది. కాస్త ఆలోచన

వున్న ఏ మానవుడూ నమ్మలేని యీ బూటకపు కేసును మేధావులు న్యాయమూర్తులైన శ్రీ జడ్జి గారు కొట్టివేస్తారని నమ్ముతున్నామన్నారు డిఫెన్సు తరఫు న్యాయవాదులు.

స్తబ్దంగా బోనులో నిలబడి వున్న రామకృష్ణ మనసులో ఆలోచనలన్నీ కలగా పులగంగా వున్నాయి. తనేం చేశాడో, నేరం చేశాడో లేదో ఏమీ అర్థం కావటంలేదు. ఆలోచనలు ఏ విధంగానూ ముందుకు సాగక, గజిబిజిగా చిక్కునడి, శిక్షపడుతుందేమోనన్న భయం భీకరమైన సుడిగుండం కాగా, ఆ గుండంలో సుళ్ళు తిరుగుతున్నాయి. ఇంత అలజడిలోనూ ఒకే ఒక భావం స్పష్టంగా వుంది—అది ఎట్లైనా యీ శిక్ష తప్పిపోవాలనే గొప్ప ఆరాటం.

ఇప్పుడు స్పష్టంగా మరింత గాఢంగా వున్న దన్నమాటేగాని యీ అలజడి ఆరాటం రామకృష్ణకు సుపరిచితాలే. పెన్సిల్ పోయింది. ఎక్కడో జారి పోయింది, జేబు చిరుగులోంచి. 'చిరుగుజేబులో ఎట్లా వేసుకున్నావురా, వెధవా! మొద్దు వెధవ్వి, చేతిలోనించే జారవిడిచి వుంటావు. రోజుకో పెన్సిల్ తేవటానికి సొమ్ము పోగుపోసుకొని కూర్చున్నావా? ఆ వాగి పట్నంగాని లేకుంటే నీలాంటి మందమతి వెధవకు చదువెందుకు, దండగ, ఎర్రటి కళ్ళతో తనమీద విరిగిపడుతూ వున్న పెద్ద పర్వతం లాగా నాయన చెయ్యెత్తి నిల్చున్నాడు. ఈ దెబ్బ తప్పితే, ఎవరైనా వస్తే, చెయ్యి తూలి పక్కకు పడితే—కాని తప్పదు! యింకా మీద పడలేదు, ఎప్పుడు పడుతుంది, పడుతూ వుందా! ఇది తప్పదు!—ఆనాడూ యిదే ఆరాటం.

రామకృష్ణ హైస్కూల్లో అడుగుపెట్టాడు. అప్పుడు ప్రసాదరావు యిప్పుడు జడ్జిగా కూర్చుని వున్న ప్రసాదరావు—మూడురోజుల జ్వరం వలన బడికి రాక ఆ మొత్తం నోట్సు రాసుకుంటూ కూర్చున్నాడు బడి అయ్యాక. ప్రసాదరావు పెన్నులో సిరా అయిపోయింది. రామకృష్ణ పాత చొక్కాజేబులోంచి మేనత్త నాగమ్మ కొత్తగా కొనిచ్చిన పెన్ను గర్వంగా మెరుస్తోంది. దాన్ని అడిగి తీసుకుని రాసుకుంటున్నాడు ప్రసాదరావు. చీకటి పడుతోంది. రామకృష్ణ పెన్నుకోసం అట్లాగే కూర్చొని వున్నాడు. 'నీ పెన్ను బాగా రాస్తుంది. రేపిస్తానులేరా' అని తీసుకెళ్ళి పోయాడు ప్రసాదరావు. వుసూరుమంటూ యింటి కెళ్ళాడు రామకృష్ణ. 'ఏదిరా నీ కొత్త పెన్ను? యిట్లాగియ్యి' అన్నాడు సుబ్బయ్య తన కూలి డబ్బు గుర్తు రాసుకోటానికి. నోరు తెరచి నిల్చున్నాడు, రామకృష్ణ ఏమీ చెప్పలేక. యివాళ నన్ను చంపేస్తాడు పెన్ను లేదని. ఏం చెప్పినా వినడు. చంపేస్తాడు, చంపేస్తాడు, చంపేస్తాడు!—ఆనాడూ యిదే ఆరాటం.

బోనులో నిల్చున్న రామకృష్ణ మనసులో యీనాడూ అదే ఆరాటం—శిక్ష పడకూడదు, పడకూడదు, పడకూడదు అని.

భయపడిపోయిన చిక్కుముడిఅయిన రామకృష్ణ మనసులో నుంచీ యిరుపక్షాల న్యాయవాదులూ తమకు కావలసిన దారాల్ని కావలసినంత మేరకు బయటకు లాగారు. ముడి మాత్రం విడివడలేదు. ఆ పని అసలు తాను ఎట్లా చెయ్యాలిగావా అని రామకృష్ణకు తెలియనే లేదు.

ఆ రోజున జీతం తెచ్చి సుబ్బులు చేతికిచ్చాడు. అన్నం తినటానికి పోతుంటే సుబ్బయ్య రూపాయి కావాలని అడిగాడు. చిత్తుగా తాగటానికి. తాగి తూలుతూ యింటికి వచ్చి ఓపికుంటే రామకృష్ణని ఒక్క పనికిమాలిన మొద్దు వెధవ అయినందుకూ, ఇంత చదివీ ఏడెండల పని సంపాయించి ఎక్కువ డబ్బు తేలేనందుకూ తిడతాడు. ఓపిక లేకుంటే అట్లాగే ఏ మూలోపడి నిద్రపోతాడు. రోజూ జరిగేదే యిది. రోజూ సుబ్బులు ముసిలాడికి తాగటానికి పావలా యిస్తుంది. జీతం వచ్చిన రోజున మాత్రం రామకృష్ణ దగ్గర్నుంచే రూపాయి తీసుకుంటాడు. ఆరోజు మర్చిపోయి అంతా సుబ్బులికే యిచ్చేశాడు. 'దాని కిచ్చేశాన ,అడిగి తీసుకో' అన్నాడు. సుబ్బయ్యకు కోపం వచ్చింది. సుష్టుగా తాగుదామని ఆశపడ్డాడు. అది యిస్తుందో యివ్వదో, 'ఆడముండ చేతికి డబ్బిచ్చి దాని చేతిలో ఆడేవాడివి నువ్వూ మొగాడివే నంటారా, మొద్దువెధవా' అన్నాడు. రామకృష్ణ మాట్లాడకుండా బుర్ర వంచుకు నిలబడ్డాడు. 'యిన్నేళ్ళూ ఆ ముండ చేస్తే పెద్దోడివయ్యావా నేను పెడితే అయ్యావా? యివాళ పుట్టగోశంత

వుద్యోగం వస్తే నేనూ మొగోడివని అనుకుంటున్నా వేమో. దాన్నడిగి డబ్బులు తీసుకోమంటావంటరా వెధవా. నీ చేతికొచ్చిన వాడ్నైనా అట్టేపెట్టుకో లేవంటరా?... ఒక్క నలుసుని కనలేని ఎధవ్వి...' అంటూ తిడుతున్నాడు. సుబ్బులు కూలికి పోయి వచ్చి అన్నం వొండిందేమో అలసటగా నిల్చుని చూస్తున్నది. ఎంత గర్వంగా తాంబైఅయిదు రూపాయలు తెచ్చి దాని చేతిలో పెట్టాడు తాను! రామకృష్ణకు వాయనమీద ద్వేషం పుట్టుకొచ్చింది. 'నోరుమ్మూయ్' అన్నాడు. సుబ్బయ్య ఒక్కనిమిషం ఆగి 'ఓహో! వానపాముకి కోర లొచ్చినయ్యే ఎప్పుడో'' అన్నాడు, అంత ఎగతాళీ ఒక్కవాక్యంలో యిముడ్చుతూ. 'అవున్రా, వెధవా, పుట్టు వెదవ్వి నువ్వు. పదేనేళ్లయి పెళ్లయి ఒక్కనలుస్ని కన్నావట్రా? అది చూసి చూసి ఎవడ్నో తగులుకుంటుంది. నువ్వు ఎదవ ముండల్లే కూర్చో' అన్నాడు.

యింత ప్రపంచంలో తనూ ఒక మనిషిననీ, మొగుణ్ణనీ, చదువుకున్న వాడిననీ గుర్తు పెట్టుకొని కాస్త చెప్పిన మాటలు వినేది సుబ్బులు ఒక్కతే. దానిముందు ముసిలాడి మాటలు రామకృష్ణ సహించలేకపోయాడు. ఆవేశంతో పిడికిళ్లు గట్టిగా బిగుసుకుపోయాయి. పళ్లు గిటగ్గరుచుకుపోయాయి. 'ఏందీ... మళ్లీ కుయ్యి' అంటూ ముందుకి పోయాడు. 'పోన్లే, ముసిలాడి మాటలకేం' అన్నది సుబ్బులు. ముందుకు పోయిన రామకృష్ణకు ఒళ్లు తెలియలేదు. ఎన్నో ఏళ్లనుండి పేరుకుపోయిన ద్వేషానికి, ఆవేశానికి కట్ట తెగింది. సుబ్బయ్యను ఒక్కతోపు తోశాడు. తల పట్టుకొని గట్టిగా గోడకేసి కొట్టాడు. అంతే. 'చంపితివి కదరా ఎధవా' అని అరిచాడు సుబ్బయ్య.

ఇరుగుపొరుగు వాళ్లు వచ్చేసరికి తలపగిలి రక్తం మడుగులో వున్నాడు. రామకృష్ణ మొద్దుగా చూస్తూ అక్కడే నిలబడిపోయి వున్నాడు. 'ఏందిరా, మందమతీ, ఏమైందిరా' అన్న సోములి మాటలతో యీ లోకంలోకి వచ్చాడు.

తరువాత పోలీసులూ, సంకెళ్లూ, గందరగోళం. వున్న యిల్లు కాస్తా తనఖా పెట్టి డబ్బు తెచ్చి లాయర్ను పెట్టించింది సుబ్బులు.

*            *            *

జడ్జి శ్రీపాదరావు మనస్సు గతంలోకి పరుగెత్తింది. తాను చిన్నప్పుడు నాన్నగారు ఆ వూళ్లో వుద్యోగంలో వుండేవారు. —చిన్న చాక్లో యిరుక్కున్న పెద్దమనిషి లాగా యిరుగ్గా ఇబ్బందిగా అప్పుడు అవూరు చిన్నది. కాలేజి లేదు. ఈ రామకృష్ణ తనకు చాల మిత్రుడు అక్కడ. తామిద్దరూ మొదట పరిచయమైన సన్నివేశం బాగా గుర్తుంది. ఆ రోజున తాను బళ్లో నోట్సు రాసుకుంటూ వుండిపోయాడు ఆలస్యంగా. వాడి పెన్ను పట్టుకొచ్చేశాడు. యింటికివచ్చేసరికి నాన్నగారు బోనులోని పులిలాగా పచార్లు చేస్తున్నారు. ఆయన చండశాసనుడు. ఆలస్యంగా యింటికొచ్చినందుకు కొడతారేమోనని భయం వేసింది. నోట్సు రాసుకుంటూ వుండిపోయానని చెప్పాడు తాను. 'వేళకు యింటికి రావాలంటే రావల్సిందే. ఆ నోట్సు యింటికి పట్టుకొచ్చి రాసుకోకూడదూ? వేషాలు' అంటూ పర్వతంలాగా పెద్దగా నిల్చొని తిడుతున్నారు. అంతలో అమ్మ వచ్చింది. 'అసలే జ్వరంపడి లేచాడు భయపడిపోయాడు. ఈ మూడురోజుల నోట్సూ రాసుకుంటూ వుండి వుంటాడుగాని యివాళ్టికి వూరుకోండి' అంటూ తనని తీసుకువెళ్లిపోయింది. 'నీ మూలాన్నే వాడు చెడిపోతున్నాడు' అని అమ్మమీద కేకలేశారు నాన్నగారు.

మరునాడు రామకృష్ణ చెప్పాడు—పెన్ను తేలేదని వాళ్ల నాన్న బాగా కొట్టాడట. 'ఆలస్యంగా వెళ్లినందుకు నన్నూ కొట్టబోయాడు మా నాన్న' అన్నాడు తాను. నాన్నల నిరంకుశత్వానికి బలి అవుతూ వున్న యిద్దరు బాలుర పరిచయం అట్లా మొదలైంది.

రామకృష్ణ తండ్రి కర్కశత్వం మూర్తీభవించినవాడు, క్రూరత్వానికిమారురూపం అనే విషయం తనకూ బాగా జ్ఞాపకమే. రామకృష్ణకు అమ్మలేదు. అంతరాత్మ నెరుగని శాసనంలో పెరిగాడు. క్షమ, ప్రేమల నెరుగని శాసనాన్ని ఒప్పుకొని తల ఒగ్గిన మనసు మందమతి కాక ఏమవుతుంది? అమ్మ లేకుంటే తనూ అంతే అయి వుండేవాడా? ఏమో! పాపం, రామకృష్ణ!

శాసనం, అంతరాత్మ, పూర్తిగా భిన్నమైనవి రెండూ. ''అంతరాత్మ నెరుగని చండశాసనం నుంచి

క్రూరత్వం పుట్టుకొస్తుంది. శాసనం ఎరుగని అంతరాత్మ నుంచీ అరాచకం పుట్టవిస్తుంది. వ్యక్తికీ సంఘానికీ కూడా అర్థం చేసుకొని క్షమించే మెత్తని వెన్నలాంటి అంతరాత్మకు గట్టితనాన్నిచ్చే శాసనం—నియమం—అవసరమే. సంఘం యొక్క స్థితినిబట్టి ఆ రెండూ ఒక బాలన్సు ఏర్పరచుకొంటాయి. అప్పుడు ఏర్పడేది చట్టం. సంఘక్షేమం దృష్ట్యా ప్రయోజనం దృష్ట్యా ఏర్పడుతుంది అది. తానీ వేళ దానికి మంచి ప్రతినిధి కాగలిగాడంటే దాంట్లో అమ్మ పాత్ర ఎంత వుందో నాన్నగారి పాత్రా అంతే వుంది. తన ప్రేమంతా అమ్మ మీదైతే. గౌరవమంతా నాన్నగారి మీద. తన మనసే అమ్మైతే, అది సువాసనలీనే మంచి గంధపు చెక్క అయితే దాన్ని శ్రీకృష్ణుని మూర్తిగా మల చింది నాన్నగారు.

తనకీ విషయం తెలియనప్పుడు, తన కింత విచక్షణా జ్ఞానం ఏర్పడనప్పుడు తాను నాన్నగారిని ద్వేషించాడు. అమ్మ మెత్తదనాన్ని చూసి కోపగించు కున్నాడు. ఎందుకీ అమ్మ నాన్నగారికి తగిన సమాధానం చెప్పదు? ఎందుకు ఎదురు తిరగదు? ఎందుకు వేరై పోదు? అని అర్థంలేని కక్ష పుట్టుకొచ్చేది.

ఇప్పుడు వాళ్ళిద్దరూ లేరు. తన జీవితమే వాళ్ళ జ్ఞాపకానికో వందనం. అందరూ అంతే. తల్లి దండ్రుల జీవితాలకు, వాళ్ళు ఏర్పరచుకొన్న భావ సమన్వయానికి సజీవ ప్రతిబింబాలు బిడ్డలు.

ఇప్పుడు తన ఎదురుగా వున్న సమస్యకు న్యాయమైన పరిష్కారం చెయ్యాలి. రామకృష్ణ పరిస్థితి తనకు బాగా తెలుసు. సుబ్బయ్య గుణమూ తెలుసు. రామకృష్ణపైనాది ఆనాటి అభిమానం తాను మరచిపోలేదు. బాల్యస్నేహితుణ్ణి చూసి నిట్టూర్చాడు ప్రసాదరావు.

*   *   *

ప్రసాదరావు—చిన్ననాటి తన ఆప్తమిత్రుడు తనను తప్పకుండా గుర్తించి వుంటాడు. తననూ తన తండ్రి యొక్క క్రూరత్వాన్ని బాగా ఎరిగిన ప్రసాదరావు జడ్జిగా రావటం తన అదృష్టం. తప్ప కుండా కేసు కొట్టేస్తాడు. తన తప్పేమీ లేదని తెలుసుకుంటాడు. తన తండ్రి రాక్షసుడని బాగా తెలిసిన ప్రసాదరావు. రామకృష్ణ మనసులో ఆశ.

ఏడేళ్ళు కఠినశిక్ష పడినదని విన్నప్పుడు రామకృష్ణకు అంతా అయోమయమై పోయింది. తన తండ్రి విషయం బాగా ఎరిగిన ప్రసాదరావే తనకీ శిక్ష విధించాడా? ఎందుకు తన మీద ఎవరికీ దయ కలుగదు? ఎందుకు ప్రపంచమంతా తనమీద కత్తి గట్టింది? ఎందుకు? ఎందుకు? అర్థంకాక దిక్కులు చూస్తూ వుండిపోయాడు. వున్నట్టుండి హృదయం లోంచి ఒక పెద్ద ఆర్తనాదం—ప్రపంచంతో సంబంధం విడిపోయిన పిచ్చివాడి ఏడుపు—బయటికి వచ్చింది. 'ఓ' అంటూ పెద్దగా ఏడిచాడు రామకృష్ణ.



# పొనుగోటి జగన్నాథరావు "కుముదవల్లీ విలాసము"

శ్రీ రంగాచార్య

నల్లగొండ జిల్లా యందలి 'ప్రాచీనకవులు—కృతులు'ను గూర్చి తెలుపవలయునను నుద్దేశముతో ప్రప్రథమముగా 1966 డిసెంబర్ 'భారతి' యందు 'మరింగంటి రాఘవాచార్యులు—కేశవస్వామి శతకము' అను పేరనొక వ్యాసము వ్రాసియుంటిని. ప్రస్తుతము—పన్నిద్దఱాళ్వారులలో నొకఁడుగా ప్రసిద్ధుడైన పరకాలుని (తిరుమంగయాళ్వారులు) చరిత్రమును "కుముదవల్లీ విలాసము" అను నామాంతరమున ప్రశస్త ప్రబంధముగా సంతరించిన పొనుగోటి జగన్నాథ రావును—తత్కృతిని గూర్చి వివరించుచున్నాను. గోలకొండ కవుల సంచిక యందీతనిని గూర్చి (399 పుట)

"జగన్నాథరావు పొనుగోటి
ని. పొనుగోడు, దేవరకొండ తా॥
కా. 250 సం. క్రిందట
ర. కుముదవల్లీ విలాసము (ప. కా)
వి. ఇనుగుర్తిలో ముద్రితము. వ్రాతప్రతి వడ్డేపల్లిలో బెల్లంకొండ నరసింహాచార్యుల వారి వద్ద గలదు. కవికి 11 పురుషుఁడు ముద్రించెను'

అని గలదు. 'ఆంధ్రకవి సప్తశతి' కారులును పై విషయమునే గ్రహించిరి. ఈ ఆధారములు దప్ప సాహితీ లోకమున కన్యాధారములు లేవు. ఈ కుముదవల్లీ విలాసము బదాశ్వాసముల ప్రబంధము. కర్త—పొనుగోటి జగన్నాథరావు. రాఘవరాయాప్పలాంబల పుత్రుడు. పద్మనాయక వంశీయుఁడు. వెల్లచెల్ల గోత్రుఁడు. వాధూలాన్వయ తిరుమల దేశికాగ్రణి శిష్యుఁడు. గురువునకే యీ ప్రబంధము సంకితము చేసెను. పొనుగోటి వాస్తవ్యుఁడు. ఇందలి గద్యపద్య వివరములు—

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము— | 138 |
| ద్వితీయా ,, | 168 |
| తృతీయా ,, | 183 |
| చతుర్థా | 177 |
| పంచమా ,, | 237 |
| మొత్తము గద్యపద్య సంఖ్య | 903 |

కవి వ్రాసిన ప్రతి జీర్ణమై పోవుచుండగా, ఈతనికి నెనమిదవ పూరుషుఁడగు కృష్ణారావు తాళ పత్రములపై తిరుగ లిఖియించెను. దీని ముద్రింప వలయునను తలంపు గల తద్వంశీకులు ప్రముఖ కవిపండితుడునగు శ్రీ మానోర్ధనం వెంకటనర సింహాచార్యుల[1] వారిచే పరిష్కరింపించి వరంగల్లు జిల్లా ఇనుగుర్తి విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయము నందు ముద్రింపించిరి. (1925). కృష్ణారావుగారు లిఖియించిన గ్రంథము—

'ప్రాసంబుల్ సరిలేక వర్ణచయ శబ్ద
ప్రాభవార్థంబు ల
న్యాసంబంధము లౌటచే పఠనకత్యాసక్తి
శూన్యంబుగా

---

1. ఈతడు మిర్యాలగూడెం తా. విభురాము పేట వాస్తవ్యుఁడు. సుమారు 40 సం. క్రితము పరమ పదించెను. బహువిధ గ్రంథనిర్మాత, కృతుల యందు హెచ్చు భాగము అముద్రితములు. "తిరుమంగయాళ్వారు చరిత్రము"ను యక్షగాన సరణిగా నొక ప్రబంధము వ్రాసెను. అముద్రితము.

నీ సాహిత్య కవిత్వలక్షణముచే నింపొందు
వారెందు మా
కాసన్నంబయి గుందురో యనుచు
శంకాతంకచేతిస్కుడై (1—9)
అట్టి కృష్ణవిభున కాత్మజుండై శ్రీని
వాసరావుగారి పౌత్రుడగుచు
భువి ప్రసిద్ధి నొందు పెనుగోటి వెంకట
రాయ భూవరుండు రసికుండగుట" (1—10)చే

విచారించి '...సంస్కృతాంధ్ర సాహిత్య రసాలంకార నిపుణతాతిశయాంచత్సరసకవిత్వామృతవాగ్భరిత సద్గ్రంథరచన భాసుర హృదయుండై''న గోవర్ధనం వెంకట నరసింహాచార్యుల వారిచే పరిష్కరింపించి నటుల తెలియుచున్నది.

పై గ్రంథమున 'పెనుగోటి జగన్నాథరావు' అను నీ కవివర్యుడు తనను గూర్చి...

''అశ్వపతి దత్తమత్తేభహయద భూమి
కాధ్వజచ్ఛత్ర చామర కల్ప విభవ
సకల సామ్రాజ్య శాశ్వతైశ్వర్యధుర్య
రాజవరుండ జగన్నాథరాయవరుండు'' వని చెప్పు

కొనినాడు. అశ్వాసాంత్య గద్యయందు ''ఇది శ్రీమచ్ఛీతా రామచంద్ర కరుణాకటాక్ష వీక్షాసంలబ్ధ సకల సామ్రాజ్యధౌరేయ పరమభాగవత విధేయ పల్లచెల్ల గోత్రపవిత్ర పెనుగోటి రాఘవరాయ పుత్ర సుకవిజన గేయ శ్రీ జగన్నాథరాయ ప్రణీతంబైన కుముదవల్లీ విలాసంబను మహాప్రబంధమువందు ...అశ్వాసము'' అని గలదు. నావద్ద గల ముద్రిత ప్రతి ననుసరించి పై విషయములతోబాటు వాతని వంశము

కొండభూపాలుడు

| | | |
|---|---|---|
| తిరుమలరావు | రాఘవరావు ఇతనికి అప్పలాంబ—లింగాంబలనుభార్యలు | |
| | జగన్నాథరావు (కృతికర్త) | జగ్గారావు రాఘవరావు కొండలరావు, |

అని తెలియుచున్నది. ఈ కవి తరువాతి వారి వివరములకై యత్నించితిని కాని యిప్పటి వరకును లభ్యము గాలేదు. ఈతని వంశీయులు 'పెనుగోడు' నందు గలరు.

ఈ 'కుముదవల్లీ విలాసము' పన్నిద్దఱాళ్వారు లలో వొకరుండైన పరకాలుని గూర్చి తెలుపును. ప్రప్రథమముగా నీయాళ్వారుల చరిత్రమును ప్రబంధ రూపముగా సంతరించినవాడు భారత కవిత్రయములో పరిగణితుడునగు ఎఱ్ఱాప్రెగ్గడ వంశీయుండైన చదలువాడ మల్లన— ఈతని విప్ర నారాయణ చరిత్రము ముద్రితమై ప్రచారమున నున్నది.2 దీని తరువాత యావదాంధ్రదేశమున విశేష ముగ వ్యాప్తిగన్నది సారంగుతమ్మయ్య రచించిన ''వైజయంతీ విలాసము'' అను ప్రబంధరాజము. తరువాత విజయరాఘవనాయకుని 'విప్రనారాయణ చరిత్ర ము'ను యక్షగానములు, తాళ్లపాకవారి పరమయోగి విలాసము (ద్విపద). వీని యనంతరము — ప్రస్తుత 'కుముదవల్లీ విలాసము', గోవర్ధనం వెంకటనరసింహా చార్యులవారి 'తిరుమంగయాళ్వారు చరిత్రము'. వీనిలో ప్రతిదానియందును ఎన్నియేని నూతన విషయములు తెలియును. ప్రతి సాహిత్యాభిలాషికిని చారిత్రకాభిలాషి కిని ఆవశ్యకతనీయమైన గ్రంథములు[illegible]వి.

కవి యా. పరకాం చరిత్రమును—తాళ్లపాక తిరువేంగళనాథుని 'పరమయోగి విలాసము'న గల కథనే[4]

---

2. ఆంధ్ర సాహిత్యపరిషత్తు (కాకినాడ) వారి పక్షమున క్రీ. శ. 1940 లో నీ గ్రంథము విపుల మైన పీఠికతో ప్రకటితమైనది. పీఠికాకర్తలు— శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు. M.A,

3. దీనిని తంజాపురీ సరస్వతీ మహలువారి పక్షమున, అచ్చటి పండితులునగు శ్రీ అ. మహా దేవశాస్త్రి, శ్రీ విఠలదేవుని సుందరశర్మగార్ల సంపాద కత్వమున వెలువడినది. (విశేషముల కొరకు— చూ|| 'రాజగోపాల విలాసము'—చెంగల్వకాళకవి రచ నము, మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే ప్రకటి తము, (1951) సంపాదకులు—పరిష్కర్తలు— పీఠికాకర్తలు ఆచార్య శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, పీఠిక 53, 54 పుటలు.)

4. 'పరమయోగి విలాసము' (ద్విపద) షష్ఠ సప్తమాశ్వాసములలో నీ కథ గలదు. తిరుపతిదేవస్థానం వారి ప్రచురణ (1938) పుటలు—374—471.

యాధారముగ గైకొని ప్రబంధ రూపమున సంతరించినట్లు తెలియుచున్నది. కవి దీనిని ప్రబంధ రూపముగ చేయదలంచి కొన్ని మార్పులను చేర్పుల చేసెను. ఐనను కథాగమనమునకు లోపముంరాక రసవంతముగ గలదు. ఈ విధముగ మార్పు చేయుట దోషముగాదు. ఏలనన

'యత్స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్యవా
విరుద్ధం తత్పరిత్యాజ్యం అన్యథా వా ప్రకల్ప యేత్'' (సాహిత్యదర్పణము)

అనిగదా అభియుక్తోక్తి,

## గ్రంథ విషయము—విశేషములు

'కావేరీతీరమునందు గల చోళమండలమున 'పరిరంభణపురము' 'కమలాపూర్ణపురము' అను రెండు పట్టణములు గలవు. కమలాపూర్ణపురమున్ననే నీ పరాంతకుఁడు(పరకాలుఁడు)గలఁడు.ఈతడు 'సంగ్రామ రాజవిలయలయనాపరాంతకుఁడు'. రాజైన చోళ దేశాధీశుఁడీతని పర్రాక్రమమునకు మెచ్చి తన సేనానిగా నుంచుకొనెను. పరకాలుఁడు నిత్యము వైష్ణవార్చనలు చేయువాడు—మహాభక్తుఁడు. రాజు వద్ద నమ్మికగా నుండువాఁడు. కొంతకాలము తరువాత రాజు బొక్క సము నుండి ధనము గ్రహించి భాగవతపూజలు సలుపుచుండెను. ఈ విషయము ప్రభువునకు దెలసి ధనమంతయు సమాప్తియగు చున్నదను బాధతో కరణముల బిలిచి లెక్కలు చేయించి—పరకాలుని బట్టి బంధించవలసినదిగా ననుమతించెను. కాని ఆతఁడు ఈ రాజు సైన్యమునకు వశుఁడుగాకపోవు టయేగాక అనేకవిధములుగా బాధపెట్టును. రా జీవిషయమును తెలిసికొని యాతనిపైకి యుద్ధము నకు స్వయముగాబయలుదేరి వెడలి—పరాభూతుఁడై పరకాలుని పిలిచి యాతని పరాక్రమమును బొగడి తన రాజ్యమునకు తీసుకవెళ్లి—మాయోపాయములచే బంధించి బాధించును. పరకాలుఁడు చింతాక్రాంతుఁడై భగవస్తుతి చేసి ధనము సంపాదించి చోళరాజున్యన కొసంగి ఋణ విముక్తుఁడగును. ఈ విధముగా ధనము సంపాదించి తన బాకీని దీర్చిన పరకాలుని భక్తికి—మహిమకు సంతసించి క్షమాపణ వేడుకొని తన రాజ్యమునం దర్ధభాగ మాతని కొసంగును.'' ఇది ముఖ్యమైన కథ. ఇవియే గాక—

అమృతహస్తుఁ డను వైద్యునకు సరోవరమున లభించిన కుముదవల్లి యను బాలికను పరకాలుఁడు పెండ్లియాడుట, ఈతని వైష్ణవభక్తి, చౌర్యదక్షత, భటులు (దొంగలు) జైనుల యాలయమున గల సువర్ణ ప్రతిమను దొంగిలించి దానిని కరిగించి శ్రీరంగమునందలి దేవాలయమునకు ప్రాకార గోపురాదులు నిర్మించుట—మొదలగు ననేక విషయములు నిందు రసవంతములుగా గలవు. కవి యీ రచన యందు దన యసమాన పాండిత్య ప్రకర్ష చూపి—ప్రబంధము నెంతయో యమూ ల్యాలంకారముగ జేసెను. ఇందలి కవిత్వము ప్రౌఢముగ నున్నను చదువరులకు విసుపు జనింపక ఉత్సాహమును కలిగించును. కవికి గల కవితా ప్రాగల్భ్యము, సంస్కృ తాంధ్రభాషాపాండిత్యము, వివిధ వృత్త రచనా కౌశ లము నిందు చూడవచ్చును.

ఈ ప్రబంధము పూర్వకవుల పోలికల ననుసరించి రచియింపబడెను. కవి వంశాదికము, గురు పరంపర, గ్రంథరచనాకారణములు, గురుస్తుతి, షష్ఠ్యంత ములు, పురవర్ణనాదులు పుష్పలావికాది తదితర వర్ణనలు కవి చేసెను. విశేషజన్మురాలైన కుముదవల్లి పేరు ప్రబంధమునకుంచుట, వైజయంతీ విలాస నామము కారణమేమో ననిపించుచున్నది,

ఈతని రచన యందలి కొన్ని యనుకరణలు:

''సొగసొప్పన్ పరిపక్వపాకరుచిగా
జుయ్యన్నచో ఘుమ్మనన్
బొగపుం దాలుపు సోడుముట్ట
మిరియంపుంబొళ్లు పైగుప్ప నొ
ప్పగు పేరెన్నిక కూరగాయలును
రాజాన్నంబు సద్యోఘృతం
బొగి పచ్చళ్లును జారుతైరు నిడి చేయు
వైష్ణవారాధనల్''

(కుముద 2—10)

అను పద్యము చదువగనే

''పునుగుందావి ననోదనంబు మిరియంపుం బొళ్లతోఁ జట్టిచుయ్యను......'' ఇత్యాది 'ఆముక్త

మాల్యద' (1—82)యందలి పద్యము (౧)ను స్ఫుర ణకుదెచ్చును. ఇట్టి సందర్భములవేగాక పుష్పలావికాది వర్ణనల యందును కవి యాముక్తమాల్యదనుపూర్తిగ ననుకరించెను.

గోరంత భూది నెలం
గోరికమై దాల్చునతని కొండంత యప
స్మారంబుజెందుననుచే
క్ష్మారమణవియందె తారుకాణుయ్యె చెలీ
(కుముద 3—122)

అను పద్యము నందలి మొదటి రెండు చరణ ములు పూర్తిగా శ్రీనాథుని హరవిలాస ద్వితీయాశ్వాసమున గల —

ఆవగింజంత బూదిమై నలదికొనిన
వెలది! గుమ్మడికాయంత వెఱ్ఱిపుట్టు —''

అను వాని ననుకరించినవి.

ఈ విధముగ ననుకరణలు హెచ్చుగ గలవు. విస్తర భీతిని వదలుచు, ప్రస్తుత ప్రబంధమునకు నాధారభూతమైన 'పరమయోగి విలాసము' నందలి కొన్ని యనుకరణల జూపెదను.

పరమయోగి విలాసము—

''అల్లి లోనుదయించెననియెన్ని కుముద
వల్లినామంబిడి వారని ప్రేమ'' (378పుట)

కుముదవల్లీ విలాసము: —

అల్లి లోపల బుట్టిన తల్లిగాన
సల్లలిత భాగ్య    ్యమైన
ఇల్లతాంగికి కైరవవల్లియనుచు
నామమిడిపెంచి తాత్మలో ప్రేమమెసఁగ (1—21)

పరమయోగి విలాసము: —

పసమించు తెలి నలపంపు బింజియలు
పసఁగ జుట్టినయట్టి బోడకుల్లాయి
చింపికుప్పసములు చెవిదోరములును
పంపుటంబులతోఁడ జంపాడు నొడలు
బిగువుగా చేంపదోపిన బలపములు
తగి నలవడఁగసత్తిటి కరణికులు (383 పుట)

అనుదానిపి కొద్ది భేదముగ మార్చి తన కాలపు కరణికులను ఇట్లు వర్ణించెనేమో

తల నమరు గొప్పపాగలు
మొల గంటపువరలు కోకముసుకులలో చం
కల నిఱుకు కవిలె కట్టలు
గలిగి వడిన్ వచ్చిరంత కరణపుమూఁకల్
(కుముద 2-70)

పరమయోగివిలాసము నందలి వైద్యుని వర్ణన:

ఛంకమందులసంచి జగజంపు వలువ
పెంకమై నిజకర్ణముల నొప్పుదశాది
కునివడఁ జుట్టిన కుఱుమాపుపాగ
యనువంద పంచలోహంపుటుంగరము

నురుతలంబైనట్టి యూర్ధ్వపుండ్రంబు
కరమొప్ప వలికేలి కరకకాయలును
బెరయు పచ్చడముతోఁ బెనుపడ నంది
నర గనుపట్టు బాహాటపుస్తకము

బనుఁడలో గుణపాఠంబుఁ జదివి
కొనుచు మూలిక్కలు దిక్కులుఁ జూచికొనుచు
కమలాక్షపాదపంకజభక్తి నిరతుఁ
డమృతహస్తుఁ డనంగ నలవడువాఁడు
వెన్న ధన్వంతరి కెనయైన వైద్యుఁ
డ న్నగరన యుండు నతఁ డేగుదెంచి(377పుట)

కుముదవల్లీ విలాసమున:—

చిన్నగా గనుపట్టు చిన్నారి తలపాగ
కర్ణకూపంబుల గలయఁజుట్టి
దట్టంపు హోంబట్టు పట్టంచు ధోవతి
నడుగుల మీఁద జీరాడ గట్టి
తీరుగా దిద్దిన గీరునామములలో
తిరుచూర్ణ మొకవింత సరణి దీర్చి
వలెవాటు వేసిన వలిపెదువ్వలువలో
సవరించి మందుల సంచినిలిపి

చంకబాహాటశాస్త్రపుస్తకము దాల్చి
ఖాదనారోగ్యవస్తువుల్ కరకకాయ
కేల తాళిసచూర్ణంబు నోలిబూని
సరవి నరుదెంచె నా వైద్యచక్రవర్తి (1—69)

వైద్యమున ప్రౌఢిల కీగల వస్తువంత
లెక్కవేయుచుఁ గేలి మూలికలు వెతకు
సంచి కట్నంబు లివేళ చాలదొరికె
నంచునుబ్బుచు వచ్చె నయ్యమృతకరుడు
(1—71)

సీ. మాటిమాటికి "శతమాతా హరీతకీ"
యని చేతి కరకకాయలు గణించు
పలుమారు "లంఘణం పరమౌషధం"బని
యెదురైన రోగుల కెఱుకబలుకు
ధర "కపిత్థం సర్వదాపథ్య" వనుమాట
బలుకుచు వెలగల బారుగాంచి
"అగ్నివైద్య మతః పరం" బనుచుండెడు
కారువెజ్జులు జెప్పగాంచి నవ్వు
తే. గీ మఱియు గుణపాఠములు మహామహిమజదువు
పూర్వదినలబ్ధకృతిభక్ష్య భోజనాజ్య
జీర్ణతను దెచ్చి యొక్కింత జీరకంబు
నమలు పెడబొజ్జ నిమురుచు వసుతకరుడు
(1—72)

అను నీ పద్యములు చూచిన 'పరమయోగి విలాసము'న కన్న నీ వర్ణన విపులము—శ్రేష్ఠముగను గలదు.

ఈ విధముగ కుముదవల్లీవిలాసకర్త పరమ యోగి విలాసమును హెచ్చుగా ననుకరించినను—తత్కర్తృ ప్రశంసయు కావ్యప్రశంసయును గూడ చేయక—

శ్రీమహాభాగవతకథాజీవనంబు
పావనంబును కుముదవల్లీ విలాస
మను ప్రబంధము..........."

అని మాత్రమే పేర్కొనెను. పరమయోగి విలాసమున హెచ్చుగ లేని యుద్ధవర్ణనము, జినపతి ఖండనము, భక్తాంఘిరేణులైన పరకాలుని యొక్కయు—లనుచరుల యొక్కయు చౌర్యములు తద్విశేషములు —ఈతడు హెచ్చుగ వర్ణించెను.. కుముదవల్లీ వర్ణనయందు శృంగారమును విచ్చల విడిగా వర్ణించెను.

ఇక్కవికి వర్ణనలనినచో మిక్కిలి యిష్టముగాం దోచుచున్నది. విస్తరభీతిని రెండు పద్యములు మాత్ర ముదాహరించెదను.

కంభాణపుంభరింభాసముద్ధూత ధ
రాపరాగాతిసీరంధ్రనభము
పటుకరిస్ఫుట కటీతట సముత్కట దాన
పంకాంకసంకులప్రాంచితోర్వి
ఘోరవిక్రమసార వీరకోలాహల
బధిరాయమాన దిక్పాలకంబు
వాతత కేతనవ్రాతత భీతాహృత
చటుల కాదంబినీ సముదయంబు
లగుచు పెంపొంది లెక్కకు నగ్గలముగ
వెలయునట్టి గతి సేనలోలి చాల
వేపుజూపంగ దీపితాటోపమహిమ
నడచెనప్పుడు చోళభూ నరవరుండు
(2—149)

మందారకుందారవిందారనిభముఖ
చ్ఛవి సొగవెన్నెల జివురగొలుప
తరుణారుణోత్కీర్ణ కిరణారుణాంగంబు
చదలకుంకుమనిగ్గు వెదలజల్ల
కందర సుందరస్కంధ రాజితశోభ
మెఱుగు జుక్కలలోడ మేల మాడ
స్వర్ణవర్ణస్ఫురత్పక్షద్వయము దిశా
తతుల శంపాలతాతతుల బెనుప
పిశితభుగ్గణవిదళననిశితతుండ
మింద్రవజ్రంపువజ్రంబు వేవగింప
రంగవిభునాజ్ఞ దరణి చేరంగవచ్చె
పక్షికులచక్రవర్తి యర్ధక్షణమున
(5—52)

వీని వలన కవి యొక్క వర్ణనానైపుణ్యమే గాక—కవిత్వమునందలి బిగువును సంస్కృతాంధ్ర పదప్రయోగ కౌశల్యమును వ్యక్తము లగుచున్నవి.

'చిరకాలము నుండి నామమాత్రావశేషితముగ నున్న యీ ప్రబంధమును గూర్చి నాకు దోచినవిధముగ తెలుప సాహసించితిని. సాహితీ పరిశోధకులకీ వ్యాస విషయమేమేని యుపకరించిన ధన్యుడను. అమూల్య మును—అలభ్యముగ నున్న 'గోలకొండ కవుల సంచిక' యందు మాత్రమే ఈ గ్రంథనామము గలదు. శిష్య వాత్సల్యముతో నాకీ 'గోలకొండ కవుల సంచిక'ను అందచేసిన మా గురువర్యులు శ్రీ కె. రామకృష్ణ శాస్త్రి ఎం. ఎ. (రీసర్చి స్కాలర్ (తెలుగు) ఉస్మా నియా విశ్వవిద్యాలయము)గారికి కృతజ్ఞత లర్పించుచు ముగించుచున్నాను.

# బేతాళుడి కథ

శ్రీ మానేపల్లి సత్యనారాయణ

నేను గ్రంథాలయంలో నాక్కావలసిన
పుస్తకంకోసం వెదుకుతున్నాను.

గ్రంథాలయంలో పుస్తకాల అద్దాల్లోంచి
బంగారం తళుక్కున మెరుస్తున్నది.
నేను గొప్ప సంస్కృతి మధ్య, మహోన్నతుల సమక్షాన
ఉన్నట్టు మనసంతా జ్వలిస్తున్నది.

ఆ గ్రంథాల్లోంచి వచ్చే ఒక రకమయిన పరిమళం
నాలోనిండి ఎక్కడికో లాక్కుపోతున్నది.
కొత్త లోకాలు చూడబోయే ముందువలె
మనసు చక్షుశ్శక్తి పొందింది.

ఒకానొక గ్రంథం బహుగొప్ప వేదము వంటి గ్రంథం—
తెరిచీ తెరవగానే సోమకాసురుడు పైకి వచ్చాడు.
మత్స్యావతారం ఎత్తడంరాడు నాకు—అయినా
ఆ రాక్షసుణ్ణి చంపి సముద్రంలో పడేశాను.

భయం వేసిందంటే ఒప్పుకోనుగాని
ఆ బీరువా వదిలి మరో బీరువా తెరిచాను.

నా యభిప్రాయం మ్యూజు కనిపించాలని—లేక పీన డయానా.
కాని ఏ హెర్క్యులిస్ అయినా కనిపిస్తే నా గతేం కాను?
బంగారు రేకుల రెపరెపల్లోంచి జాగ్రత్తగా చూస్తున్నాను
అక్టోపస్— ఎనిమిది తలల నాగు బుస్సుమని పైకి వచ్చింది
నేను నిజంగా ఉలిసిస్‌ని కావాలి
ఆ ఎనిమిది తలల పాముని- పెద్దకత్తితో చంపి

మధ్యధరా సముద్రంలో పడేశాను,
జూడాస్ నవ్వినట్టనిపించింది—

ఈసారి ఆ వరస పూర్తిగా తప్పించాను
బాగా ముందుకి వచ్చాను—

చక్కని గ్రంథంకోసం చూస్తున్నాను.
ఈజిప్షియనుల పిరమిడ్లు—స్ఫింక్స్—
అవన్నీ జాగ్రత్తగా దాటేను—నైలునది
ఫారోరాజులు—అఖెనాతన్—టుటున్‌ఖామెన్
అందర్నీ వెనక వదిలేశాను. చిత్రలిపి అర్థంకావడంలేదు.
చాలా ముందుకి జరిగిపోయి ఒక గ్రంథం తెరిచాను.
ముందు వరసగా మూడు దయ్యాలూ
ఆ తరవాత మెక్‌బేత్...
మేక్‌డఫ్‌ని తలుచుకుని, మెక్‌బేత్ తలనరికి
ఈటెకి గుచ్చి పైకెత్తేను
దయ్యాలు మూడూ "హెయిల్ దీ" అనుకుంటూ
మాయమయ్యాయి. ఎలుగుబంటిలాగ ముందుకి నడిచేను.
బాంకో దయ్యంగాని, హేమ్‌లెట్ దయ్యంగాని
కనిపిస్తుందన్న భయం నా కెంతమాత్రం లేదు.
ఆ బీరువా వదిలిపెట్టి తూర్పువేపున...
కావా రేఖా ? క ఖ గ ఘ...వాగర్థావివ సంపృక్తౌ
మరో బీరువా దగ్గరికి వచ్చాను.

రాజరాజనరేంద్రుడు నన్నయ శ్రీనాథుడు...
అక్కడ ఆగి ఒక పుస్తకం పైకి తీశాను
కహ కహ నవ్వుతూ కాటయవేముడు పైకి వచ్చాడు
నందికంతపోతరాజుకటారితో తలనరికి
కాలితో మట్టి ఒక్కతన్ను తన్నాను—
లకుమాదేవి "కర్పూర వసంతరాయా" అన్నది

భయం నాకెంతమాత్రం లేదు గనక
మళ్లా యిందాకటి బీరువా దగ్గరికి వెళ్లాను.
షెల్లీ, కీట్సు—అందమయిన వసువుల ఆనందం

డికెన్సు గడ్డం తడుముకుంటూ కనిపించాడు.
పుస్తకాలు వరసగా తప్పించుకుంటూ వేళ్లు జరిపాను
షా నవ్వుతూ—"ఎలిజా—మై ఫెయిర్ లేడీ" అన్నాడు.

ఆకాశవా —మీరు వింటున్నది బేతాళకథ
విన్నారా నాక్కావలసిన గ్రంథం నేనింకా తీసుకోనేలేదు.

సమార్‌సెట్‌మామ్—.. కాస్త కళ్లు ప్రక్కకి తిప్పేను
మలార్‌మే—బోదిలేర్—రాంబో—ఫ్లాబేర్
మోపాసా—ఆంద్రేజీద్—కమున్
జాంపోల్‌సార్త్ర దగ్గిర ఆగేను
"మాన్‌శియేర్! ఫిల్‌వూ ప్లే" అన్నాడు సార్త్ర.
నొబెల్ ప్రయిజు తీసుకుని వచ్చేశాను.
టీయస్ ఈలియట్ నాలుగుకృత్యులున్న
పుస్తకం చేతపట్టుకున్నాను. నా నెత్తిమీద
మామ్ కనిపించి దెయ్యంలాగ నవ్వేడు.
కతి అంచు తీశాను.

చాలుచాలును లంగరెత్తుము—అది గురజాడ కంఠం
ప్రేయసీ—విశాఖపట్నం రుధిరజ్యోతి అన్నాడు నారాయణబాకు
కుక్కపిల్లా అగ్గిపుల్లా చాలు ఖడ్గసృష్టికి అని
ఓ సినీవాలీ త్వమేవాఽహం అన్నాడు అరుద్ర.

మాట్లాడకుండా బయిటికి వచ్చాను
నాక్కావలసిన గ్రంథం తీసుకోకుండానే
బేతాళుడి శవం నాకు మౌనభంగం చేస్తున్నది.
కాళికాపూజచేసి మరోరోజు బయల్దేరతాను.

# దాశరథి కవితా పుష్పకం

శ్రీ రామమోహనరాయ్

నవ్య కవిత్వోద్యమంలో భావకవితా సౌరభాన్ని నింపుకొని అభ్యుదయ కవిత్వోద్యమంలో కవితా రథసారథ్యం వహించారు శ్రీ దాశరథి. తెలంగాణా ఆంధ్రోద్యమంలో ఆయన మహారథుడు. తనకు తానే గొప్పసంస్థ. అప్పటికే లబ్ధప్రతిష్ఠుడు. "కళ్ళల్లో కోపం ఒళ్లంతా కవిత్వం"తో తరతరాల బూజు నిజాం రాజు నెదిరించి 'ఖబడ్దార్' అని హెచ్చరించి "ముసలి నక్కకు రాచరికంబు దక్కునే" అని ఎలుగెత్తి చాటి "తెలంగాణము రైతుదే రైతుదే రైతుదే" అని ముమ్మాటికీ నొక్కి చెప్పేరు. తన తెలంగాణ తల్లిని గూర్చి మురిసిపోతూ వీరగీతాలు తన గళంలోపలికిస్తూ "నా తెలంగాణ కోటిరత్నాల వీణ" అని ప్రస్తుతిస్తూ తనకు తానే యువయోధుడై తెలంగాణా విముక్తి సమరాన్ని నిర్వహించేరు. "అగ్నిధార"ల్ని కురిపించేరు. మహాంధ్రోదయాన్ని సాధించారు. "పాటలు పాడితి తెలుగు బాబులు నిద్దుర మేలుకోగ, కోటి తమ్ముల కట రెండుకోట్ల తెలు

గన్నలను గూర్చి వృత్తాంత మంతజేసి
మూడు కోటులకొక్కటే ముడిబిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్య గీతి"

అని తృప్తిగా నిట్టూరుస్తారు దాశరథి. మహాంధ్రోద్యమపు వెల్లువ చల్లబడి సమతలాన ప్రవహిస్తున్నది. 'అగ్నిధార' సమసిపోయి వలపు పాటలు వేడిగా వాడిగా వస్తున్నాయి. 'దాశరథీ శతకం'లో అభినవ రామదాసుగొక స్వయంగా ఎన్నో నీతులనూ, సమకాలిక జీవితం పైన విసురులనూ, గుచ్చుకొన్న ముల్లును సున్నితంగా పెరికి తీసే వాడుపుతో వ్యంగ్యంగానూ కవిత నందించారు. దాశరథి విప్లవానికి వెనుకబడి తిరుగుబాట చాటమనే భీరువు. (Reactionary) కాడు. వలపు పాటలను వ్రాసే తత్వం మహాంధ్రోద్యమపు కాలంలోనూ ఉన్నది. దాశరథి ప్రాంతీయ తత్వం తలకెక్కి విశ్వ లోకైక భావనకు దూరమైనవాడు కాడు. కుల మతాలను ఏనాడో విస్మరించాడు.

"నా కులమెద్దియో యెరుగ
నా మతమెయ్యదియో యెరుంగగా
లేక దశాబ్దముల్ గడిచె
లేళ్లది రాళ్లది యేళ్ల దేకులం
బా కులమే మదీయము"

అని సగర్వంగా చెప్పిన శూరుడతడు. కళ్ళు ప్రపంచావలోకనం చేసి బుద్ధిని ప్రసరింపి గుణావగుణాలను వివేచన చేసికొని సంప్రదాయాన్ని విస్మరించకుండా అధునాతన సంప్రదాయాలకు ఒరవడి దిద్ది తెలంగాణాలోని కవులకు "ఒజ్జ" అనదగినవాడు దాశరథి.

అంగారాన్నీ శృంగారాన్నీ కలగలిపి విసూత్న శైలిలో విద్యుత్ ఛందస్సులో రేడియమ్ లక్షరాలతో కవితల్ని వెలారుస్తారు దాశరథి. అయితే విప్లవ కవిత శృంగారభావనా పరస్పర వైరుధ్యాలు కావంటాడాయన. అందుకు సాక్ష్యంగా 'ఉర్దూ' కవులను మరెందరో కవుల వాక్యాలనూ ఉదహరిస్తారు. తాను నిజాం జైలులో కఠోర శిక్ష ననుభవిస్తున్నప్పుడూ పోలీసులుతరుముతున్నప్పుడూ శృంగార భావనకు దూరం కాలేదంటారు.

"నా యింటి చిన్నది నడుము సన్నముది,
న్నుల తెల్గు సిగ్గులు మొలక లెత్త" సింగారించుకొన్న "రసభర విజృంభమాణ పూర్ణ కుచ కుంభ"గా తెలుగు కన్యను వర్ణిస్తారు. 'తెల్గు సిగ్గులు' అని దాశరథిమాత్రమే అనగలరు. ఆ తేజస్సు

సన్నగిలి పేలవమ్మైన వలపు పాటలు సినిమా గీతాలు గిలికే కవిగా మిగిలారు దాశరథి అను కునే వారిని చకితుల్ని చేసి దాశరథి ఎన్ని సంప్రదాయాలన్నైనా యిముడ్చుకొని కాలంతో పాటు సాగిపోగలిగిన కవితాహృదయం ఉన్నవారని పిస్తుంది యీ "కవితా పుష్పకం" చదివితే. అంతేగాక దాశరథి కవితావేశం కాళానికున్న వేగం వంటిది. దాశరథి పదాలకై పెదాలు తడుముకోవటం దాశరథికి అల వడని పాండిత్యం కవితకు నిరంతరము నగిషీలు చెక్కి కొయ్యబొమ్మలను తీర్చిదిద్దటం దాశరథికి చేతగాని కళ. హృదయంలో నుండి దూసుకొచ్చిన సమాపగుంభన తప్ప సరళమ్మైన స్వచ్ఛందమ్మైన తన భాషలో పాండిత్యాన్ని జొరనీయరు. వ్యుత్పన్నతను పరికించాలంటే దాశరథి మహోన్నతుడు. ఎన్ని రత్నా లను వెలికితీసినా వట్టిపోని రత్నాకరుడు. మరి తన కవిత్వం నిసర్గ మధురంగా ఉండాలని కోరుకునే పాఠకులు

"ఒంటరిగా వింటర్‌లో
వెళ్లబోకు భాయీ" అనే మాటలలోని

పేలవతనూ

"గగనంలో చుక్కలు
తోటలోని పూవులు
కలహించక కలిసుండును"—'కలిసుండుట'

మనే మాట కటువుగా విన్పిస్తుంది. శిష్ట వ్యావహారికం వ్రాయాలనుకొనేవారు కొందరు క్రియా పదాన్ని మాత్రమే వ్యావహారికం చేసినట్లు భాషలో ఒకరీతినీ, నడకనూ అనుసరించే కవి ఉన్నట్లుండి ఇటువంటి పదప్రయోగానికి పూనుకోవటం బాగుగా లేదు.

"ఒంటరితనమే ఒక
గోరంటముల్లులా గుచ్చెను" అనగలిగిన

సుకుమార భావుకుడు 'వింటర్' అనే పదాన్ని అదీ దాని పరిమళానికి సరిపడా మరో మాట లేనట్లు దానినేవాడటం బాగుండలేదు.'కవితా పుష్పకం'ఎల్లెడలా పుష్పసౌరభం గుబాళిస్తున్నది. శకరకాల పూలు న్నాయి. కొన్ని వాసనా విలసితాలైతే మరికొన్ని శబ్దచమత్కారంతో ముగ్ధమోహితుల్ని చేస్తవి. కొన్ని పొరుగు తోటలో నుండి ఎరువు తెచ్చి అంటుకట్టి మొలపించినవి కాగా, కొన్ని నిత్యమల్లెలు ఎక్కడున్నా ఇంపు గొలుపుతాయి.

సూక్ష్మ విభాగానికి "కవితా పుష్పకం"లోని కవితలు మూడు విధాలుగా కనిపిస్తాయి. అవి 1. వసుధైక కుటుంబభావనతో వ్రాసినవి 2. ప్రణయ కవితలు 3 ప్రకృతిని, పండుగలనూ వర్ణిస్తూ వ్రాసినవి. ప్రణయ కవితలలో మీర్, జఫర్ కవులకు అనువాదాలుకూడ ఉన్నవి.

వసుధైక కుటుంబ భావనతో వ్రాసిన వానిలో ఎన్నదగినవి "అమృతమూర్తి" "పావురాళ్లు" "చక్రధరి", "కవితాపుష్పకం "స్నేహగీతి" 'రాజహంస", "అమావాస్య దీపాలు" "త్రిమూ ర్తులు లిరవ్వ" మొదలైనవి.'అమృతమూర్తి' అనే మహాత్ముని శక్తి సభివర్ణించేది. "వాని చేతిలో సత్యమె మొక్కవోవని నిశాత మహాయుధమ్మై చెలంగెడి'నట.' గాంధీజీ నివ్వల నుమిసెడి వారికి కప్పురపున్ నవ్వులిచ్చె" ననటం సనందుగా ఉన్నది. 'చక్రధారి' అమరనీరుడు అబ్దుల్ హమీద్‌గూర్చి వ్రాసినది. వీరోచితంగా, ఉత్తేజాన్ని రేకెత్తించి అంజలి ఘటించి నట్లున్నది. 'కవితా పుష్పకం'లో దాశరథి హృదయ సౌకుమార్యం దాగుంది.

"ద్వేషాలు కలిగించే భాష మనకు వద్దు
ప్రేమను రేకెత్తించే కోమలభాష మనకు
కావాలి.

నీవే భాషలో కన్నుగీటినా
నా కర్థమౌతుంది సఖియా!" ఈ విధంగా

ల్పంలో పన్నపోగాడు చెక్కే విధం మధురంగా కనిపి స్తుంది. భాషాభేదాలకూ, వాదాలకూ అతీతుడై దాశరథి గాలిబూ—కాళిదాసూ తనపాతమిత్రులనీ, నజ్రులిస్లాం—టాగోర్ తన కొత్తమిత్రులనీ నిస్సంకో చంగా చెప్తాడు. స్నేహాన్ని తైలంతోనూ, దీపంతోను అలంకారికాలేనొట్లా పోల్చినా స్నేహానికి ప్రతీకగా అభి నవాంధ్ర కవితామండలికి స్నేహపాత్రుడుగా దాశరథి నిలిచారు. 'రాజహంస' లెలా ఉంటాయో ఊహిస్తూ

"వెన్నెలను గడ్డ కట్టించి దాన్నినొక్కి
హంసల్ని తయారు చేస్తాననుకొంటాను' అని

కవిబ్రహ్మగా మనముందు నిలుస్తాడు.

'అమావాస్య దీపాలు'లో "స్పైనికుని
శిరస్త్రాణంలో
పాలీడల్లిన గూడు
శుభం చెబుతున్నది."

యుద్ధానికి స్వస్తి చెప్పండని వివరిస్తూ
"కాటరాక్టు ఆపరేట్" చేయించుకోండి
జాతికి 'రెటీనా డిటాచ్‌మెంట్' జరిగింది
జన్మజన్మాలకీ కళ్ళు కనబడవు"

అని హెచ్చరిస్తారు. త్రిమూర్తులలో హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతసామరస్యాన్ని కోరారు. సూత్నప్రయోగంగా 'జాన్, ఉస్మాన్, భగవాన్' అనే త్రిమూర్తులను తన హృదయవర్తులుగా నిలుపుకొన్నారు. 'నీలిరవ్వ' అనే కావ్యంలో మిసిసిపీ విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైన జేమ్స్ మెరిడిత్ నీగ్రో కావటం వలన హర్షిస్తూ అభినందన తెలియజేశారు. "నల్లనివాడ" అనే పద్యంలో పోతన పద్యపు టనుకరణ కనుపిస్తుంది. అయితేనేం ఎల్లలులేని దాశరథి హృదయం దాన్ని స్వంతం చేసుకున్నది. ఎందుకైనా అనుకరణ సమర్థులుచెయ్యవలసినది కాదు.

ప్రణయ కవితలలో మేలైనవి "మధు మంజరి" "శాంతి" "అంధుని అనురాగ గీతి" "ఏకాకీ న రమేత" "మనసులో దీపాలు" "వలపు సేతువు" "మరు మరీచిక" మొదలైనవి. మధు మంజరిలో ఛందస్సు క్రొత్తది. భావాలు క్రొంగ్రొత్తవి.

"నిలుతు రెన్నిన్నాళ్ళు కలచ జూచెడివారు
వలచువారె జగతి గెలుచువారు!
..............................
జ్వాలజ్వాల నడుమ శలభంబుపోలిక
ఇరువు రతివ లందు పురుషుడొకడు
..............................
కొమ్మబొమ్మ వ్రాసికొనిపోయి చూపితి
బొమ్మ చూచి కన్నుబొమ్మ ముడిచె
..............................
ఆమె నడచివచ్చి నట్లనిపించును
చుక్కలాకసమ్ము నెక్కునపుడు" భావాలలో ఉర్దూకవుల ప్రణయతత్త్వంలోని గభీరమ, మాధుర్యమూ తొంగిచూస్తాయి. భాషవిషయంలోనూ భావాల విషయంలోనూ స్వతంత్రత ఉన్నది. ప్రబంధ కవుల శృంగారానికి దీటైన శిల్ప చాతుర్యమున్నది. వీటికి తోడు చదువగానే మనస్సుకు పట్టే ఛందస్సు మంజరి. "పూలను ముద్దుపెట్టుకొని, ముండ్లను వద్దనబోకు నీవు నీ వేలటు తాకినంత పూలకింపవె కంటకముల్ సుమమ్ములై!" ఇంతకంటె శాంతి సౌభాగ్యానికి మరేం కావాలి? ఈ ఖండకావ్య సంపుటికే అత్యుత్తమమైనది "అంధుని అనురాగగీతి." అందాన్ని కళ్ళారా చూడనోచుకోని అంధుని భావన ఆయోమయం. కాని అంధునికి అనురాగా స్పందజేసిన అతివ అందచందాలను వర్ణించిన తీరు చూస్తే అంధుని మనోనయనానికి ఆ అతివ కనుపించినట్లే అనిపిస్తుంది. అంధుడు.

"గుండె కొట్టుకొనుటగూడ చూచితి నేను
పెదవు లదరు టనుభవించినాను,
దాపరికములేని దాక్షిణ్యమూర్తి, నా
గుండెనూట దివ్వెకురికె నేడు." అని వేదనలోనే ఆనందాన్ని పొంది పాఠకుల హృదయాలను చూరగొంటాడు. ఎల్లెడలా అందం విస్తరించి ఇందు గల దందులేదని వెదుక నక్కరలేకుండ ఉండగా ఎవరూ ఒంటరితనంలోనే హాయిని జుర్రుకోవాలనుకో కూడదు. అందుకే "ఏకాకీ న రమేత" అంటున్నారు. ప్రియుని మనస్సులో దీపం వెలిగిస్తుంది ప్రియురాలు. దాశరథి పాఠకులందరి మనస్సులలోనూ దీపాలు వెలిగిస్తాడు. ముస్తాబుకాని చెలిముందు విరహంతో వేగిపోతూ తన విరహానికి ప్రియురాలి హృదయానికీ వలపుసేతువు నిర్మించుకుంటాడు. ఆ సేతువు బలమైంది.

"జీవితపు చిన్నారి కుసుమము
చిన్నబోయే లోపుగానే
చేయిచేయీ కలిపి యౌవన
శీధు వానుట మేలులే" అని తన ప్రేయసిని తట్టి హెచ్చరిస్తాడు. దాశరథికి "సౌందర్య మొక తీరని దాహం," అందుకొమరుమరీచికలతో పరుగెత్తి మరుమరీచికలలో ప్రణయమధువు క్రోలుతాడు.

ప్రకృతినీ పండుగలనూ వర్ణిస్తూ వ్రాసిన వాటిలో ముఖ్యమైనవి, "ఉగాది వెలుగులు" "నవ వసంత వైభవము" "చైత్రగీతం" "సంక్రాంతిరాత్రి"

''హిమకామిని'' మొదలైనవి. దాశరథి ప్రతిపండు గకూ తెచ్చిపెట్టుకొన్న ఆవేశంతో seasonal poetry వ్రాసే కోవలోని వాడుకాడు. కాని అతడి కవితలో మిగిలిన ప్రణయ, విప్లవ భావాలను పరికిస్తే యీ విధమైన పండుగపాటలు సరితూగవు. కవితావేశంలో పలికిన కొన్నిపాదాలు మురిపించినా వీటిలో రసస్పర్శ తగ్గిపోతూ వచ్చింది.

ముద్దులొలుకు
పల్లెపడుచు కచమ్ముల నల్లసిల్లు
వోదుగును మించినట్టి పువ్వేది జగతి?

వాస్తవాన్ని వివరించటంలోనే కవితాభానం పాదుగుతాడు దాశరథి. శిశిరంలోనుండి వసంత ఆవిర్భావాన్ని కవి గుర్తించినంతగా ప్రకృతే గుర్తించలేదేమో! అందుకే,

'చేదుకారు వేపచెట్ల కొమ్మల నీడ
తీయదనముగంతు వేయసాగె
చింతజెందియున్న చిత్తమ్ములందున
క్రొత్తవత్సరమ్ము మత్తు జల్లె'

అని వసంతాహ్వానంతో మత్తెక్కిస్తాడు కవి.'ఒకట కోకిలసల్కె, నొకట శారిక కుల్కె' అనే పద్యాలో ప్రత్యక్షరమూ రసవంతమైన మధుబిందువే. సంక్రాంతి రాత్రి, చైత్రగీతిలో కవిత పేలవతకు దిగజారింది, 'హిమకామిని'లో ఋతుధర్మముగా చెప్తూనే, ఛందస్సును మన్నిస్తూనే చక్కని భాషలో వర్ణన చేశాడు.

'కవితా పుష్పకం'లో అన్నీరసవంతమైన ఖండికలే కాకపోవచ్చు. ఎవరైనాసరే నచ్చని వాటిని వ్రేళ్ల మీద లెక్కించవచ్చు. ఉదాహరణకు చిరంజీవి నెహ్రూ; ఆకాశంలో అనుస్వారాలు మొదలైనవి. 'జిజ్ఞాస' మంచిగేయమైనా యీ సంపుటంలోచోటు చేసుకొనదగినది.

నవ్యకవిత్వపు మహాప్రస్థానంలో మరపురాని మహాకవిగా దాశరథి గణుతికెక్కాడు. తన కవిత్వాన్ని నిత్యమూ జాలువారే మరంద మకరంద ధారగాచేసి పాఠకులను కలకాలమూ అలరించగలడు. పొరుగు భాషలనుండి ద్రాక్షాసవాన్ని మీర్, జఫర్‌లను అద్వితీయంగా అనువదించిన తన కవితాశక్తిని సార్థకం చేసికొనగలడు.

''తెలుగు ఊరులు
తెలుగు వారలు
ప్రతిఫలించే
మహాకావ్యం
నాకు కావలె
నాకు కావలె' అని దాశరథి మహాంధ్రోదయంలో ఉజ్వలమైన కాంక్షతో వేపోయారు. తెలుగుదేశాన్ని ప్రతిఫలింపజేయగల మహాకావ్యాన్ని దాశరథి వ్రాయ పూనుకోవటం సముచితం.

కవిహృదయం కవి గుర్తించినంత సరిగా మరెవరూ గుర్తించలేరేమో!' ఆరుద్రగారు కవితకు వ్యాఖ్యానప్రాయమైన పరిచయం కాక 'పరి పరి పరిచయాలు' వ్రాసి దాశరథి వ్యక్తిత్వాన్ని—అంటే అతడి కవితా పుష్పాలలో దాగివున్న దరాన్ని వెలికి తీశారు. తెలంగాణ రచయితల సమావేశంలో ల్ని చదివిన ప్రతి కవి గొంతూ దాశరథిదే అని శ్రీశ్రీ, ఆరుద్ర అనుకోవటం దాశరథి కవిత్వానికి గీటురాయి. ఆ కవులలో ప్రసిద్ధులైన వారీనాడు ''జన్మజన్మాల కతని సౌమిత్రినే నేను'' అని చెప్పుకోవటం దాశరథికి గర్వకారణం. కవిగానూ, మనిషిగానూ అతడి జీవితం ధన్యం. సన్మానాలు పొందిన కవులెందరో ఉండవచ్చుగాని, కవుల హృదయాలను ఆసాంతం లక్ష్యంగా సాధించిన కవులెందరికో మార్గదర్శియయి, మాత్రాఛందస్సులకు ప్రాణంపోసి, ఆయా ఛందస్సులలో దీపకంబాల్ని నిలిపి కవీనాం కవిః (Poets poet) అని పేరుగాంచటం కవి జీవించి ఉండగా జరగటం అరుదు. ఆ ఖ్యాతి దాశరథికి దక్కింది

[కవితా పుష్పకం. కవి: దాశరథి; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో మద్రాసు; మచిలీపట్టణము; సికిందరాబాదు. 112 పేజీలు. వెల: సాదా ప్రతి రూ 3. మేలు ప్రతి రూ 5.]

# తిమింగిలం

శ్రీ 'భైరవయ్య'

బెజవాడలో పార్కులో ఒక మూలగా, తలఖ కత్తిరించబడ్డ క్రోటను మొక్కలమధ్య, నిలవెత్తు సిమెంటు ఆసనంమీద, నిలువుగా కర్రచేత పట్టుకుని నవ్వుతూ నిటారుగా నిలబడ్డాడు గాంధీ మహాత్ముడు.

కింద, - ఆయన పాదాలకి ఘనాడిగా నిలబడ్డ సిమెంటు చప్టా చెంత నిశ్శబ్దంగా కేకలు. చేతుల కదలికలు. కాగితాల రెపరెపలు. గలగలలు. ముక్కలు స్థలాలు మార్చుకుంటున్నాయి. ఆ పేకముక్కల మీద వీరభద్రం చేతులు. చేతివేళ్లు అద్భుతంగా లాస్యం చేస్తున్నాయి. అయిదుగురు మనుషులు వీరభద్రం చేతి వేళ్ల తాండవం కేసి, మెరుపుల్లా కదులుతున్న మూడుముక్కలకేసి ఆత్రంగా చూస్తున్నారు. అందులో ఇద్దరుమటుకు నిర్లక్ష్యంగా వున్నారు. వాళ్ల ఆట కూడా అలాగే వుంది. వాళ్లిద్దరికీ డబ్బొస్తోంది. పోతోంది. మిగతా ముగ్గురికీ డబ్బొస్తోంది. కానీ వచ్చినట్టే వచ్చి వడ్డీ తీసుకు మరీ పోతోంది. కరువుదేశంలో వాన వచ్చినట్టేవచ్చి వరదలై, పండిన పిసరంతపంటను కూడా తీసుకు పోయినట్టు.

వీరభద్రం అలసటగా వున్నాయి. అలవాటు కొద్దీ వేళ్లు ఇటూ అటూ చిందులు తొక్కుతున్నాయి. కానీ-

వాచీ చూసుకున్నాడు. ఒంటిగంట. ఇంక మూడు నాలుగుగంటలుంది రైలుకి. ఈ లోపుని పదిహేనువందల రూపాయలు సంపాదించాలి. అంటే కనీసం మూడువేల బేరం తగలాలి. అందుకనే ఈపార్కు ఎన్నుకున్నాడు. కానీ గంటన్నరైనా ఏదీ పెద్ద బేరం [తగ]ల్లేదు. అన్నీ చచ్చుబేరాలు. పదీపరకా బేరాలు. వీటితో ఎన్నటికి మూడువేలుకాను.

మూడువేలొస్తే సగమైనా షావుకారి కివ్వాలి. అది రాకపోతే - ఆ ఆలోచన రాగానే వీరభద్రం మెదడులో భైరవుడు తాండవం చేసాడు. ఒళ్లంతా చెమటలు పట్టాయి. ఆ పని వీరభద్రం చేసి తప్పించుకుపోలేడు. క్షణాల మీద షావుకార్లుకి తెలుస్తుంది. వీరభద్రంజీవితాంతం జైల్లోనుంచి రోడ్డు మీదికి, రోడ్డు మీంచి జైల్లోకి పచార్లుచేస్తూ వుండాలి. పెండ్యులమ్ లాగ. వీరభద్రం పెళ్లిడుకొచ్చిన చెల్లెలు చర్మవ్యాపారసంస్థ నూతన సభ్యురాలైనా అవుతుంది. లేదా ఆత్మహత్య చేసుకుని చిక్కుపడని పోలీసు కేసన్నా అవుతుంది. తన సంపాదన ఈ రకమైందని తెలిస్తే గుడ్డితల్లి గుండె పగిలి పోతుంది. అందుకని వీరభద్రం ఆ పని చెయ్యడు. ఆ ఆలోచన రానివ్వడు. వచ్చినా దాన్ని దాచేసి, మెడపట్టి బైటికి గెంటబడ్డ సేల్సుమన్‌లా చిరునవ్వు నవ్వేస్తాడు

ఆలోచనల్లో పడ్డ వీరభద్రం రెండుసార్లు డబ్బు లివ్వవలసొచ్చింది. విసుక్కుని జాగ్రత్తగా ఆడటం మొదలుపెట్టాడు. ఇంకో అరగంట సేపు ఆడాడు. అరమిల్లీ మీటరు దూరం కూడా లాభం జరగలేదు.

అలవాటుగా వీరభద్రం ఇటూ అటూ చూస్తున్నాడు.

వెంకట్రామయ్య చెట్టు నీడకి పార్కులోకి [వ]చ్చి కూర్చున్నాడు. గాంధీ విగ్రహం కింద జరుగుతున్న పవిత్ర కార్యాన్ని చూస్తున్నాడు. ఛ, ఛ! అనుకున్నాడు. ఒకసారి రొంటిని తడిమి చూసుకున్నాడు. ఎత్తుగా ఒత్తుగా వుంది.

వీరభద్రం ఓరగా చూసాడు. ఆడుతున్న అయిదుగురిలో ఇద్దరికి కన్ను గీటాడు. ఆట మంచి

జోరుగా సాగుతోంది. వీరభద్రం జేబులోంచి నోట్లు పరిగెడుతున్నాయి.

వెంకట్రామయ్య తనకేమీ పట్టనట్టుగా కూర్చున్నాడు. వెంకట్రామయ్య నామాలు మానవుడు.

ఎడ్లని కొనుక్కుందామని పక్క ఊరినుంచి వచ్చాడు. రెండుజతలు కావాలి. తనక్కూడా ఒకజత తెమ్మనమని పక్కింటి సుబ్బయ్య కూడా డబ్బిచ్చాడు. రోంటిని నాలుగు వేలున్నాయి. మంచిఎడ్లని,చూసాడు. ఆ ఆసామీ అయిదువేలకి తక్కువ ఇవ్వనన్నాడు. ఎంత బతిమాలినా కుదిరిందికాదు. వూరెళ్లినట్టుకొస్తానని మరెవరితోటీ బేరం పెట్టుకోవద్దని చెప్పి బయల్దేరాడు. ఎండ తీవ్రంగా వుంటే వచ్చి పార్కులో కూర్చున్నాడు.

వీరభద్రం హుషారుగా ఆడుతున్నాడు. గడిలో పుంజులా వున్నాడు. నోట్లు నవ్వుతూ పంచిపెడు తున్నాడు.

వెంకట్రామయ్య సగం కళ్లు మూసుకుని చూస్తున్నాడు. ఊరింకా అయిదు మైళ్లుంది. ఈ ఎండలో నడవడమంటే చిరాగ్గా వుంది. ఓపిక లేదు. పదింటికి హోటల్లో ఇడ్లీ తిన్నాడు. ఆకలిగా కూడా వుంది. వీరభద్రం ఉదారంగా పంచిపెడు తున్న నోట్లకేసి చూస్తున్నాడు. తనకక్కరలసింది వెయ్యి రూపాయలు. ఈ పాటికి వీరభద్రం పదిహేను వందలు పంచిపెట్టుంటాడు.

వెంకట్రామయ్య చెట్టు చాటుకి వెళ్లాడు. కొంతసేపటికి బయటికొచ్చి ఆడుతున్న వాళ్ల దగ్గర నిలబడ్డాడు. ఆట చాలా సులభంగా వుంది.

వెంకట్రామయ్య చిన్నపందెం కాసాడు. పోయింది. మళ్లీ వేసాడు. రెట్టింపొచ్చింది. వెంకట్రామయ్య ఆడుతున్నాడు. డబ్బిస్తోంది పోతోంది. పందెం పెరుగుతోంది.

కొంతసేపటికి ముగ్గురు పందెం కాయలేక బీడీ వెలిగించుకుని వెళ్లిపోయారు.

వెంకట్రామయ్య వంద రూపాయలు కాసాడు. రెండువంద లొచ్చింది. రెండు వందలు కాసాడు నాలుగొందలొచ్చింది.

మిగతా ఇద్దరూ కూడా ఆడటం మానేసారు.

వెంకట్రామయ్య బుర్రమీసాల్ని మెలిపెట్టు కుంటున్నాడు.

వీరభద్రం చేతులు తడబడుతున్నాయి.

వెంకట్రామయ్య నాలుగొందలు కాసాడు. ఎనిమిది వందలొచ్చింది.

వెంకట్రామయ్య కళ్లు సంతోషంతో తూలుతున్నాయి. వీరభద్రానికి భయం పట్టుకుంది. ముక్కల్ని జాగ్రత్తగా చూసాడు. అవే ముక్కలు.

రూపాయికి మూడు రూపాయలు పందెం.

వెంకట్రామయ్య నాలుగొందలు పందెం కాసాడు. వీరభద్రం జేబులో వేసుకున్నాడు.

వెంకట్రామయ్యకి కోపమొచ్చింది. అయిదు వందలు కాసాడు. ఉహూఁ... ఈసారి వంద కాసాడు. మూడొందలొచ్చింది. అయిదు వందలు కాసాడు. పదిహేనువంద లొచ్చింది.

వెంకట్రామయ్య బాసీపట్టు వేసుక్కూర్చు న్నాడు. మంచి పట్టులో వున్నాడు. ఉడుంలా కూర్చు న్నాడు.

వీరభద్రం వణుకుతున్నాడు. 'డబ్బిలాపోతే తన చెల్లెలి గతి—డబ్బులేకపోతే తన పరువు—'

వీరభద్రం పేకముక్కలకి దణ్ణం పెట్టాడు.

మిగతా ఇద్దరూ 'కాయండి బాబూ—ఇందాక ట్నించీడు మూడువేలు సంపాయించాడు. మీరొచ్చాక ఆడి దశ తిరిగినట్టుంది. కాయండి బాబూ—పెద్దది కాయండి—అన్నారు వెంకట్రామయ్యతో.

బుర్రమీసాలు తళుకులు చూపాయి.

వీరభద్రం చేతిలో పేకముక్కలు—

ముక్కలు ఇటూ అటూ మారాయి.

వెంకట్రామయ్య వెయ్యి రూపాయలు కాసాడు. మరో వెయ్యి.

పందెం రూపాయికి నాలుగు పెరిగింది. వీరభద్రం చేతులు వెచ్చగా వున్నాయి. అరచేతులు చరుచుకుని ముక్కలు పరిచాడు. వెంకట్రామయ్య బుర్రమీసం సవరించుకుని 'రావే నీయ్యాల' అని తిట్టి 'ఎయ్యి' అన్నాడు.

పందెం పెరుగుతోంది. తగ్గుతోంది.

వీరభద్రం తిన్నగా కూర్చోలేకపోతున్నాడు. వెంకట్రామయ్య కదల్లేకపోతున్నాడు.

నిమిషాలు దొర్లుతున్నాయి. అంతకన్నా ముందుగా నోట్లు పరిగెడుతున్నాయి.

వెంకట్రామయ్య తూలుతున్నాడు. అప్పుడే కాలవలో మునిగొచ్చినట్టుగా వున్నాడు.

'బాబూ భయపడకండి. ఆఖరు పందెం. కాయండి. పందెం పెద్దది వేద్దాం. ఏయ్ రూపాయికి పది. పందెం కాసుకోవే. వుంటే వెయ్యండి బాబూ వెయ్యండి.' ఇద్దరూ వెంకట్రామయ్య భుజం తడుతున్నారు

వెంకట్రామయ్య గాంధిగారికిదణ్ణం పెట్టాడు. అభిమన్యుడిలా పందెం కాసాడు.

వెంకట్రామయ్య లబోదిబో మన్నాడు. అన్యాయమన్నాడు.

వీరభద్రం నోట్లు లెక్కించుకుంటున్నాడు.

గాంధిగారు పుట్టిన భూమిలో ఇది ద్రోహమన్నాడు. గాంధిగారి ముఖం చూసి, నిజం చెప్పమన్నాడు. ఇందులో మోసం లేదా అన్నాడు. నువ్వు ముక్కలు మార్చలేదా' అన్నాడు వీరభద్రాన్ని. ఇద్దరిలో ఒకడు వెంకట్రామయ్యని సపోర్టు చేసాడు, వెనకాల నుంచుని.

వీరభద్రం నోట్లు బొత్తిపెట్టి జేబులో పెట్టుకున్నాడు. లేస్తున్నాడు. వెంకట్రామయ్య కాలరు పట్టుకున్నాడు.

వెంకట్రామయ్యకి కళ్లు తిర్లుకమ్మాయి. తల పట్టుకుని సిమెంటు చప్టా మీద పడ్డాడు. ఎక్కడున్నాడో మర్చిపోయాడు.

వీరభద్రం సిగరెట్టు వెలిగించుకున్నాడు. నోరంతా ఎండిపోయింది.

మిత్రు లిద్దరికీ వాటా యిచ్చి పార్కు బయటికి నడిచాడు. పార్కు బయట పహరా యిస్తున్న ఎర్రటోపీ,వీరభద్రం ఇచ్చిన సిగరెట్టు ముట్టించుకుని కాగితాలువుడతబెట్టి జేబులో పడేసి పోగొరులు కుంటూ వెళ్లిపోయింది.

వీరభద్రం షావుకారింటి నుంచి వస్తున్నాడు. అప్పుడే చేసిన బందరు లాటూలా వున్నాడు. టైము చూసుకున్నాడు.నాలుగున్నర రైలుకింకా అరవై నిమిషాలుంది. వెళ్లగలడు.

ఇంట్లో అందరూ ఎదురు చూస్తుంటారు. ముఖ్యంగా చెల్లెలెదురు చూస్తుంటుంది. తెల్లారగట్ల చెల్లెలికి అందరి లాగే ఘనంగా పెళ్లి చెయ్యబోతున్నాడు. పెళ్లికొడుకు కలెక్టరాఫీసులో గుమాస్తా. ఎంతో కష్టపడి వెతికి సంబంధాన్ని కుదిర్చాడు. కట్నం వెయ్యి రూపాయలు.

'తన చెల్లెలు అదృష్టవంతురాలు' అనుకున్నాడు వీరభద్రం. సొమ్ము సమకూడటం కష్టం అనుకున్నాడు. అనుకున్న దానికన్నా ఎక్కువే వచ్చింది. షావుకారు కూడా అయిదువంద లిచ్చాడు.

వీరభద్రం తొందరగా నడుస్తున్నాడు.

అతని తండ్రి అతను స్కూలు ఫైనలు చదువుతున్నప్పుడు పోయాడు. తల్లికి ఏదో వాతం కమ్మి అతనికి తెలియనప్పుడే కళ్లుపోయాయి.

వీరభద్రానికి సంతోషంగా వుంది. ఇంత కాలానికి తండ్రికిచ్చిన మాట నిలబెట్టుకుంటున్నాడు.

చెల్లెలికి పెళ్లయ్యాక వీరభద్రం ఆలోచనలు చాలా వున్నాయి.

'ముఖ్యంగా ఈ జీవితానికి స్వస్తి చెప్పి కొత్త జీవితం ప్రారంభించా లనుకున్నాడు. తెలిసినాకాయన నిజాం దేశంలో ఉద్యోగ మిప్పిస్తానన్నాడు. తల్లిని తీసుకుని అక్కడికి వెళ్లిపోవాలి. ఆ తరవాత జీవితంలో స్థిరపడాలి.

హుషారుగా ఈల వేస్తున్నాడు వీరభద్రం. స్టేషను దగ్గర్లోనే వుంది.

స్కూళ్లు నించి పిల్లలు తిరిగి వస్తున్నారు.

మళ్లీ ఏటికి తను మేనమామవుతాడు. తనలో తనే నవ్వుకున్నాడు.

వీరభద్రం రోడ్డు దాటుతున్నాడు. అవతలి వేపు నుంచి ఆరేళ్ల కుర్రాడు పుస్తకాల సంచీ పది

లంగా పట్టుకుని వస్తున్నాడు. కుర్రాడు ముద్దుగా వున్నాడు.

'తన చెల్లెలికి ఇలాంటి కొడుకు పుడితే బావుణ్ణు'' అనుకున్నాడు.

వీరభద్రం ఊగు చేరుకున్నాడు. తెల్లవజామునే ముహూర్తం. వెనకాల బండిలో పెళ్ళి వారు వస్తున్నారు. తొందరగా ఇంటికి నడిచాడు.

వీరభద్రం ఆశ్చర్యంగా చూసాడు. పెళ్ళి పందిరిలో ఏమీ హడావుడి లేదు. అందరూ వీరభద్రం కేసి జాలిగా చూస్తున్నారు. విషాదంగా చూస్తున్నారు. ఎవరూ మాట్లాడటంలేదు.

వీరభద్రం అడుగులు తడబడ్డాయి. ఎదురుగా పందిట్లో అడుగుపెట్టాడు. దొంగలా లోపలికి నడిచాడు. తల్లి నడవలో గుడ్లలో నీళ్ళు కుక్కుకుంటోంది. వీరభద్రం అడుగుల చప్పుడు వింది.

'ఒరేయ్ ఈరబద్రం కొంప ముంచేసిందిరోయ్' అంటూ గావుకేక పెట్టింది. ఇద్దరాడంగులు ఆవిణ్ణి పట్టుకున్నారు.

వీరభద్రం తిమిరెక్కిన వాడిలా నుంచున్నాడు. అందరి కేసి అయోమయంగా పిచ్చిగా చూసాడు.

'అది...నీ చెల్లెలు...సోడా కొట్టు సుబ్బిగాడితో లేచిపోయింది' అన్నాడు వీరభద్రం మేనమామ.

పాపం వీరభద్రం....

సముద్రంలో తిమింగలం పెదిమెలు నాక్కుంది.



వాడిపోయి ఉన్నదా అనిపించినది. చూడగానే! ధారణ శక్తిని ఎంత గుంజివేస్తుందో తెలిసినది.

వారే ఒకచోట శతావధానాలవల్ల తనకు సిద్ధించినది ఉబ్బసమే అని వ్రాసినారు. ఆ ఉబ్బసము, నిరంతర విద్యావ్యాసంగము, స్వగృహముతోపాటు అమూల్యమైన వారి గ్రంథ భాండాగారము వారి రచనలూ అగ్ని ప్రమాదంలో నీరవుట, కొన్ని రచనలు చోర గ్రస్తమవుట, సంసారబాధలు వారి శరీర దార్ఢ్యాన్ని పీల్చివేసినవి. కవులకు సర్వ సాధారణమైన దారిద్ర్య బాధ ఒక్కటే వారిని బాధించనిది. ఇన్ని బాధలతో వారు 76 సం॥లు జీవించినారంటే, పూర్తిగా నూరేళ్ళు జీవించడానికి జన్మించినారని తోస్తుంది.

ఆ తర్వాత మళ్లా వారిని అప్పుడప్పుడు చూస్తూ వచ్చినా, భారతి రజతోత్సవ సభకు అధ్యక్షులుగా వారు వచ్చినప్పుడు, శ్రీబాగ్‌లో వారితో సన్నిహితుడనై గడపిన నాలుగైదు రోజులు మళ్లా జ్ఞాపకము వచ్చినవి. అప్పుడు వారు గుండెలో బాధతో ఏ క్షణానికి ఆ క్షణము ప్రాణము వదలేట్లు కనపడేవారు. ఐనా శాస్త్ర ప్రశంస వస్తే వారి వాక్కు స్వచ్ఛంగా వినబడేది. శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు తమ కావ్య మొకటి వారికి వినిపించి సూచనలు గ్రహించి వెళ్లినారు.

నే నప్పుడు 'రుద్రమదేవి' నవల వ్రాస్తు న్నానని తెలుసుకొన్నందున వారు ఇంటికి వెళ్లగానే, ఆ కాలపు శాసనపు ప్రతి ఒకటి వ్రాసి అవసరమయితే ఉపయోగించుకొమ్మని నాకు పంపినారు. నే నడుగకుండానే అంత ప్రేమతో వా రది పంపినందుకు ఎంతో ముగ్ధుణ్ణి ఐనాను.

వేలూరి శివరామశాస్త్రి అ సమయముతో పూర్వకాలపు మేటి విద్వాంసులకూ, నేటి నవ నాగరక లోకానికి ఉన్న లంకె మరొకటి అంతరించినది !

శివరామశాస్త్రి గాఢముగా అధ్యయనము చేయని శాస్త్ర మంటూ లేదు. వ్యాకరణము, సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వోత్తర మీమాంసలు, ధర్మశాస్త్రములు, తంత్రశాస్త్రములు - అన్నిటితోపాటు సాహిత్య శాస్త్రము వారు పఠించినవే. కాని వాటి అన్నిటిలో గురుకులవాసము చేసి పూర్వుల నియమాలతో అధ్యయనము పూర్తిగా చేసినది వ్యాకరణ శాస్త్రము, జయంతి భగీరథశాస్త్రి పూజ్యపాదుల వద్ద. కొంతవరకు అదే విధంగా సాహిత్య శాస్త్ర రహస్యాలు తిరుపతి వెంకటేశ్వరుల వద్ద గ్రహించుట వల్లనే వారి శిష్యులు. అందువల్లనే కాబోలు, ఆ రెండు శాస్త్రాల ప్రశంస వచ్చినప్పుడు, వారు అధికారికంగా నిలిచేవారు; అనాదిగా వస్తున్న సంప్రదాయ పద్ధతులు ఆ రెంటి విషయంలో విడనాడడానికి అంగీకరించే వారు కారు. సంస్కృతంలో శబ్ద దోషము వారేమాత్రము సహించేవారు కారు. ఆంధ్రముకూడా, గ్రాంథికము వ్రాసినా వ్యావహారిక మవలంబించినా, కట్టుబాటులో ఉండేది వారి రచన.

ఇక సాహిత్యశాస్త్ర మంటేనే నిత్య నూతనమైనది. ఎక్కడ నవనవోన్మేషము కల ప్రతిభ కనబడ్డా వారు అభినందించేవారు. భావ కవిత్వము మీద పండిత పామరలోకము దాడి చేసి హేళన చేస్తున్న రోజులలో, వారు 1928 సం॥ సెప్టెంబరు భారతిలో 'భావ కవిత్వము' అనే చక్కని వ్యాసము ప్రచురించినారు. అందులో భావ కవిత్వము అనే పేరుతో చలామణి అవుతున్న 'లిరిక్' నిజముగా మంచి కవిత్వమే అని నిరూపించారు. రాయప్రోలు వారి 'విరహము' ఉదాహరించి "సాహిత్య శాస్త్రములో ఇది రసధ్వని. విప్రలంభము వ్యంగ్యము" అన్నారు. శ్రీ శివశంకరుల 'చిత్తకుబ్జ' ఉదాహరించి, 'సాహిత్య శాస్త్రమున దీనికి భావధ్వని అని పేరు' అన్నారు. అందులోనే చివరకు ఇట్లా అన్నారు; 'ఈ జాతి (లిరిక్) కవిత్వము నిక్కముగా కవి సర్‌ఫకాన్ (సొంత ఆస్తి) (Private Property)—ఇందు కవి దానవీరుడై...(కవి మనస్సును ద్రాక్ష వలె పిండి యిచ్చును.) 'న మమ' అని సంకల్పించి తన సర్వస్వమును లోకులకు ధారపోయును.' ఈ విధంగా ఆ కోవ కవిత్వాన్ని సమర్థించినా,

భావ కవిత్వము అనే పేరు మాత్రము సమర్థించ డానికి వారి మన స్సొప్పుకోక సరసంగా దాట వేశారు. 'భావ కవిత్వము అనునది ఒక పుస్తక మునకు పేరు కాజాలదు...ఆ జాతి గ్రంథమునకు లాక్షణికముగనో వ్యంజకముగనో ఒక పేరు కావలయును...ఆ పేరునకు మనకు అంతగా తొందర లేదు.' ఇట్లా అంటూ వ్యాసంలో ఎక్కువ భాగము దాన్ని లిరిక్ అనే ఇంగ్లీషు పేరుతోనే నిర్దేశించారు. వ్యాకరణ సాహిత్యా లలో శివరామశాస్త్రి బుద్ధి ప్రహతమైన బాటనే నడిచేది.

తక్కిన శాస్త్రాలలో వారి పాండిత్య మంతా స్వయంకృషి చేసి సాధించినదే. సంస్కృత వ్యాఖ్యలు, ఇంగ్లీషువ్యాఖ్యలు అసం ఖ్యాకంగా ఉన్న గ్రంథజాతము నిశితముగా నిరంతరంగా పఠించి వాటి స్వరూపము తెలుసు కున్నారు. మహాసముద్రమువంటి దర్శనా మృతాన్ని వారు అగస్త్యునివలెనే చుళికింపవలెనని పాటుపడ్డారు. ఈ దర్శనాలు అభిమానముతో పఠించే వారికి దేని కదే సత్యదర్శనముగా భాసి స్తుంది. వాటిలో యోగము, యోగసాధనము చేయనిది సంపూర్ణముగా అవగతము కాదు; పూర్వ మీమాంస యజ్ఞ యాగాది క్రతువులు చేసిన వారికే కాని సిద్ధింపదు; ఉత్తర మీమాంస ప్రణవానుసంధానము చేయువారికే కాని ఆత్మ స్వరూప మందింపదు. తంత్రశాస్త్రము కూడా మంత్రానుష్ఠానము చేయువారికే కాని ప్రత్య క్షము కాదు' వీటిలో గ్రంథాలు అవలోడన చేసేప్పుడు అతి సులభంగా కన్పడేవే, ఆచరణలో అతి కష్టసాధ్యములుగా తెలుసు కుంటాము.

శివరామశాస్త్రి దర్శనాలు శాస్త్రదృష్టితోనే పఠించినారు, కాని ఆచరణము జూపించడానికి వారు పూనుకోలేదు. అందువల్ల వారు దర్శ నాదుల విషయము ఏది చెప్పినా, స్వానుభవ ముగా చెప్పబోక, పూర్వాచార్యులయు, ప్రసిద్ధ పండితులయు, మహాయోగులయు రచనలను అనువదించుచు వచ్చినారే కాని స్వయంగా వ్రాయడానికి పూనుకోలేదు. మాయావాదమును గూర్చి భారతిలో వారు చక్కని వ్యాసాలు నాలుగు వ్రాశారు. విశ్వభారతిలో విధుశేఖర భట్టాచార్యులవారు ప్రచురించిన 'ప్రాచీన భారత వర్షమునందు శూద్రులకు గల యధికారము' అనే వ్యాసము భారతిలో (1965) అనువ దించారు. ఈ మధ్య భారతిలో అరవింద యోగుల అతిమానసతత్త్వాన్ని గూర్చి ప్రచు రిస్తూ వచ్చిన వ్యాసాలూ ఆ కోవలోనివే. అది 'అతిజటిలమైన విషయము!' చివరివ్యాసము 'ఋత—చిత్' వ్యాసాంతములో అథోజ్ఞాపికలో యోగశాస్త్ర వ్యాఖ్యానమునుండి ఋతంభరా ప్రజ్ఞను ఉద్ధరించి వివరించారు.

ఈ మధ్యనే భారతి యందు అభిమాన మున్న ఒకానొక పాఠకులు ఈ వ్యాస పరం పరలో ఒక దానిని పేరెత్తి చూపడము విచార కరమైన విషయము. అది ఆ పాఠకుని దోషము కాదు. ఈ కాలము నావహించిన దోషమే. జటిలమైన విషయాలు ఉన్నవని కాని, అవి తెలుసుకోవలసినవని కాని భావించే జనుల సంఖ్య తక్కువై పోతున్నది. మరి వాటిని అవగాహన చేసుకోడానికి వా రెట్లా శ్రమపడి ప్రయత్నిస్తారు ?

## 3

ఇంతవరకూ శివరామశాస్త్రి శాస్త్ర వ్యాసం గాలను గూర్చియే ప్రస్తావించినాము. కాని వారు ప్రధానంగా కవీశ్వరు లని ప్రసిద్ధులు కదా, కావ్య రచనలో వారు సాధించిన దేమి అనే ప్రశ్న వస్తుంది.

వా రెన్నో పద్య కావ్యాలు రచించినారు. కాని అవి అన్నీ అగ్నిహోత్రునికి ఆహుతి ఐపోయినవి, గుణాఢ్యుని బృహత్కథ వలెనే పాఠకులకు దక్కకుండా! బృహత్కథలో కొంత కాలము వరకు జీమూతవాహన చరిత్ర మాత్రము నిలిచి ఉన్నట్లే శివరామశాస్త్రి కావ్యాలు కూడా ఇంకా ఏవో మిగిలి ఉంటవనే ఆశ నాకున్నది. వారి పద్య రచనలోని సొగసు ప్రదర్శించేందుకు భారతి రెండవ

సంపుటంలో ప్రచురింపబడ్డ పద్యాలు కొన్ని ఉదహరిస్తున్నాను :

కవి

'నా రాజ్యంబున దొల్త వర్షము
వసంతం బావలం
గాని పై వేరేకాలము లేదు,
ధౌతసికతా విశ్రాంతి ధామాలె కానీ
రొంపుల్ కనరావు,
వెన్నెలలె కానీ యెండలే లేవు,
పుష్పారామంబులె కాని లేవొకట
శూన్యంబౌ స్థలాభోగముల్ ;

'మాకు నాహార వస్తువుల్ మంచి మంచి
యూహ లానందసందోహదోహలములు
వాని బడసిన యెడ మాకు బారణంబు
పడయ గలుగనిచో హరివాసరంబు.'

*　　*　　*

శిల్పి

వ్రాయుదు నాకాశంబును
వ్రాయంగా గలను నేను వాయువును మరిన్
వ్రాయుదు జీవరహస్యము
వ్రాయంగా గలను నేను భగవాను నొగిన్.

*　　*　　*

''ఎవ్వరాయన్నవారహో, యీశ్వరునకు
లేదు రూపంబు రూపంబు లే దటంచు,
వ్రాసి యుంటి నిదే భగవంతు నిందు
దీని గని మీ మతంబు దిద్దికొనుడయ్య !''

పై పద్యాలలో కవిని ఎంత ఆనంద మూర్తిగా చిత్రించారు! శిల్పిని ఎంత ధీమా కల వానిగా ప్రదర్శించారు!'

''ఎవ్వరా యన్న వారహో !''

'ఆంధ్రుడా' అని వ్రాసిన మరొక ఖండ కావ్య విషయాలు ఆంధ్రులంతా గమనింప దగినవి :

'తెలివికి సంస్కృతమున్ మరి
కలిమికి నాంగ్లేయమో యికం దురకంబో
విలువ యిడి నేర్చి యీ వీ
తెలు గెవ్వరి పాలుచేసి తిరిగెద వాంధ్రా !

*　　*　　*

'ఒక్క భాష కాదు చిక్కిన భాషల
నన్ని గూడ నేర్వు మయ్య, యాంధ్ర
నీదు మాతృభాష నిఖిల పుష్పరసమ్ము
చేత దేనె పెరను జేయు మయ్య

*　　*

వా క్కుండియును మాతృభాష రాకుండుచో
గడుమాటలేల మూకుడవు సుమ్ము

—బధిరుడవు—అంధుడవు - అన్యదేశ్యుడవు-పంగుడవు—పిచ్చివి —అని ఉద్బోధించినారు.

వారి లేఖినిలో తెలుగు భాష కొత్త పలుకు బళ్ళు అందచందాలు శక్తి సంపాదించుకొన్నది. వారు సంస్కృతాంధ్రములే కాక ఇంగ్లీషు, ఫ్రెంచి, బెంగాలీ, గుజరాతీ భాషలు కూడా బాగా నేర్చుకొన్నారు.

దొరికిన కొద్ది పద్యాలూ చదివినప్పుడు, ఇంకా ఎన్ని ఐనా దక్కి ఉంటే బాగుంటుం దనిపిస్తుంది. వ్రాసిన కావ్యాలు అగ్ని కాహుతి కావడంతో విరక్తి కలిగి పద్య రచన చేయలే దంటారు. కాని తిరిగే కాలూ, తిట్టే నోరూ ఊరుకోలేకపోతే, పద్యాలు వ్రాసే చేయి మాత్రము ఊరుకో గలదా? త్వరలోనే కొన్ని కావ్యాలైనా బయట పడకపోవని నా విశ్వాసము !

## 4

శివరామశాస్త్రి వచన రచనలలో బహుళ ప్రచారము పొందినవి వారి అనువాద గ్రంథాలు. అన్నిటిలో ముందు స్మరణకు వచ్చేది మహాత్ముని 'ఆత్మకథ' అనువాదము, ఆంధ్ర గ్రంథ మాలలో ప్రచురించినది. ఆ అనువాదము ఎంత ముచ్చట కలిగించే తెలుగులో సాగిందో చదివినవారికే కాని తెలియదు. దుష్కరమైన కార్యము సాధించారు.

వంగభాషలోనుండి శరత్‌బాబు నవలలు ముందు అనువదించి తెలుగు వారికి శరత్ సాహిత్యము రుచి చూపింది వారేనేమో!

ఇంకా వారెన్నో శాస్త్రగ్రంథాలకు వివరణలు వ్రాశారు. ఇతరుల గ్రంథాల కెన్నిటికో చక్కని పీఠికలు వ్రాసినారు. ఏమి వ్రాసినా

వారి బుద్ధిసూక్ష్మత సమన్వయము వైపుకే ఒగ్గేది కాని ఖండన వంకకు మళ్లేది కాదు. వారి అపారశాస్త్రపాండిత్యము వల్ల ఇతరుల గ్రంథాలలో ఎన్నో దోషాలు కనిపించి ఉండ వలె; కాని వారు ఇతరులను ఖండించిన ప్రస్తావము కనబడదు. మరీ దోషముగా కనిపించి నప్పుడు కొంచెము దిద్దుబాటు వలె సూచిస్తారు, వారి శిల్ప 'దిద్దుకొను డయ్య' అన్నట్లే! అల్ప పాండిత్యా లున్నవారు ఇతరుల దోషాలు చూపితే తమకు అతిశయము వస్తుందను కొంటారు. కొంతమందికి దోషాలు కొట్ట వచ్చి నట్లు కనిపిస్తవి. కాని శి. రా. శాస్త్రికి ఏదో విధంగా సమన్వయము మీదికే దృష్టి పోతుంది. కవుల పట్టుదలలు తగాదాలు అల్లరుల మధ్య మొదట వెలుగులోకి వచ్చిన వీరు, ఈవిధమైన సంయమనము సాధించినారంటే, వీరికి స్వతస్సిద్ధమైన సౌశీల్యము, సహృదయత, అపార కరుణ—ఇవే కారణా లని చెప్పక తప్పదు. వారు వైదుష్యముతో పాటు ముఖ్యంగా జీవితములో సాధించినది ఈ సౌజన్యమే! వా రందు వల్ల నిస్సందేహంగా ఉత్తమసాధకులు!

## 5

ప్రస్తుతము లభ్య మవుతున్న వారి రచన లన్నిటిలో ఉత్తమోత్తమమైనవి వారి కథానికలు అనడంలో రెండభిప్రాయాలు ఉండవు. కథానికా రచన తెలుగులో బాగా విస్తృతి పొందక పూర్వము దాని రూపు తీర్చి దిద్దిన వారిలో అగ్రగణ్యులు శివరామశాస్త్రి. వారు మొదట టాల్స్టాయి కథానువాదంతోనే ఆంధ్ర కథానికా ప్రపంచంలో అడుగు పెట్టడము గమనార్హము. కాని త్వరలోనే వారి స్వతంత్ర కథానికలు రాసాగినవి. వాటిలో కొద్ది మాత్రము స్కెచెస్ అనదగిన వైనా ఎక్కువ భాగము పరిపూర్ణత కల కథలే. వాటిలో కొద్దిగా మాత్రమే గ్రంథ రూపంగా వచ్చినవి. భారతిలో ప్రచురించిన వారి కథలే ఎన్నో సంపుటాలుగా ప్రచురించవచ్చు!

కథానికా రూపంలో వచ్చిన వారి ప్రతి రచనా ఒక్కొక్క కొంత అందంతో ప్రకాశిస్తుంది. ఆ అందమూ శక్తీ సాధించిన వారు ఆంధ్ర కథకులలో నాకు కనిపించలేదు. ఈ క్రింద వారికథలలో కొన్ని భాగాలు ఉదాహరిస్తున్నాను. అంత బాగా తా మెవరైనా వ్రాయగలరేమో నేటి కథకులను ఆత్మశోధన చేసుకోమని అర్థిస్తున్నాను. వాటిని అనుకరించడము కూడా కష్టసాధ్యమని తోస్తుంది.

'కృతి' (భారతి సంపు. 2 సంచిక 3) అనే కథ వ్యంగ్యంగా మానవులలో కుల భేదాదులు పుట్టిన క్రమము వర్ణిస్తుంది - బ్రహ్మ శాస్త్రి రామచయనుల సంభాషణలో. ఈ కథలో సందర్భవశాత్తుగా తమ గ్రంథాలు పోయిన సంగతి మరో రూపంగా చూపించారు. అందులో కవులను గూర్చి వా రన్న మాటలు చూడండి!

''వారు సంపూర్ణ సత్యమును తెలియజేయుటకు మాత్రమే యసత్య మాడుదురు. వారి మాట పాట. వారు నవ్వి యేడిపింతురు. దుఃఖమును సుఖింపజేయుదురు. వారి భాషయే సత్య భాష,'' దేవభాష. అట్టి భాషతో మాటలాడిన వా రింతపట్టు మృతి యెరుగరు.''

'జన్మాంతర సంబంధము' (భా.సం.3-9)లో చదువు రాని మంచన్నను గూర్చి, ''మంచన్నకు గుంట ఓ న మా లు దిద్దుటచే చూపుడు వేలుకు ఒక కణుపే మిగిలింది.''-ఎంత సున్నితమైన హాస్యము!

'సౌందర్యోపాసనము' (భా. 3-10) లో గురుకులంలో వస్తువులు కైంకర్యము కాసాగినవి. తన చెప్పుల జత కూడా వాటి దారినే పట్టగా, ఉపాచార్యుడు ఆచార్యులతో, 'నాకును తిరుమంగయ్యాళ్వారులు ఎదురుగా వచ్చిరి' అనును.

'చంద్రిక' (భా. 4-1) వెలమ రిలో రెండు ప్రభుకుటుంబముల మధ్య బహుకాలంగా సాగుతూ వచ్చిన విరోధము సరిదిద్దడానికి ఉద్యమించిన వివాహమే ఆ రెండు వంశాలను ఏ విధంగా నిర్మూలము చేసినదో ప్రదర్శించిన కథ. ఇందులో భయానకాద్భుతాలు పెనవేసుకొన్నవి.

ఈ కథ విశ్వసాహిత్యంలో గౌరవస్థాన మలంకరించ దగినది. వివాహవేదిక రణ రంగంగా మారుట వర్ణించిన వాక్యా లివి:

'ఆ ఘోషణమే యుద్ధారంభమునకు డుణ్డుభి. ఈ సంకులారావమున రెండు సేనలును తలపడెను. పెన్నెలకంటి వారి వంశ మునకు విక్రమరావుగారే మిగిలిరి; కలువ వారి వంశమునకు వెంకయ్యమ్మారావుగారే శేషించిరి.' కథాంతములో వా రిద్దరూ కూడా భయంకరంగా నిశ్శేషు లవుతారు.

అతిథిదేవుడు '(భా.4-3) లో వెంకట్రావు వర్ణన. 'కొన్నాళ్ళు నాటకములలో ఉండెను. కంఠమున కాకి అధిదైవతముగా ఉండుట వలనను అంగ్రమున ఆదరము లేకపోవుట వలనను అందులకును తిన్నగా పనికిరాలేదు. అతనికి పూటకూలి యింటనే అన్నప్రాశన మైనది. అతని కదే స్వగృహము.'

'దర్జా' (భా. 5-7) లో తహశీల్దారుగిరి కావలెనని సుందరకాండ పారాయణ చేస్తున్న అప్పరు సెకండరీ మేజస్ట్రేటును వర్ణిస్తూ, 'ఇహనుంచీ కావ్యం యొక్క ఉపయోగంలలో వ్యాజ్యాలు గెలవడం, ఉద్యోగాలు పొందడం-ఈ రెండూ కూడా పరిశిష్టాల కింద పరిగ ణించాలి' అంటారు. ఈ కథ కూర్పులో నేర్పు అద్భుత మైనది. ప్రతి చిన్న సంఘటనా ఆ మేజస్ట్రేటుకు తనకే తహశిల్దారు ఆర్డరు వస్తుందని నిరూపిస్తుంది. తహశిల్దారు ఉద్యోగం ఆర్డరు తెచ్చిన టెలిగ్రాము బంట్రోతుకు రు 10/-లు ఈనాము ఇచ్చి చదువుకుంటాడు. బి. ఏ. ప్యాసయి నాలుగేళ్ళబట్టీ ఉద్యోగం రాకుండా ఉన్నదని చెప్పిన తన అతిథి బంధు మాధవరావుకు ఉద్యోగము రావడం లిమిటేషను పట్టినట్లే అని సానుభూతి అంతకు ముందే చూపి ఉన్నాడు. ఈ ఆర్డరు వచ్చినది ఉద్యోగము లిమిటేషను పట్టిన ఆ బంధు మాధవరావుకే!

'క్షమాపణ' (భా. 5-10) లో జమీం దారీ కుటుంబపు కథానాయిక భర్త ఎంత చెప్పినా ఘోషా మానక, భర్త మిత్రుని మీద వ్యామోహంచేత మాని అతని వద్దకు పోయి ఉంటుంది. అతడు మాత్రము ఆమెను అమ్మను గానే చూడగా పశ్చాత్తాపంతో ఆమె తిరిగి ఇంటికి వచ్చిన ఘట్టము.

'నేను మేడమెట్లెక్క దొడగితిని. ఒక్కొక్క మెట్టెక్కుట ఒక్కొక్క లోక మెక్కినట్లుండెను. చివర మెట్టు నెక్కి నా యవమానము నెక్కితిని. డాబా మీద నిలుపబడి తొల్లిటి నా మీద నేను నిలువబడితిని.'

ఈ కథలో మిత్రుల సంభాషణలో 'తర్కము, వైశేషికము, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస, తంత్రశాస్త్రము, వైద్య శాస్త్రము, ఆస్టియాలజీ, ఫైలాలజీ, జియాలజీ, బయాలజీ, థియాలజీ, కెమిస్ట్రీ, ఫిజిక్సు, కొరాను, బైబిలు, జెందవెస్తా, బుక్కు, ఉపని షత్తులు లోనగునవి సులువుగా ఉపబృంహితము లగుచుండెను.' అని చెప్పి శి. రామశాస్త్రి తమకు అభిమాన విషయాలు పరోక్షంగా ఏకరువు పెట్టించినారు.

'అంతర్నాటకము' (భా. 5-2) లో గోపాలుడు భార్య రాధచేత స్త్రీ పాత్రధారణ చేయమని పోరాడుతాడు. ఆమె వినదు. అప్పటి వారి ప్రణయ కలహమును గూర్చి శాస్త్రి మాటలు ఎంత హృదయంగమములో చూడండి!

'ప్రణయ కలహము ప్రేమయొక్క గొలుసుకట్టు. దానిలో కాలాక్షరములు కానరావు. అది అద్వైతమునందు పర్యవసించు ద్వైతము. దీని కొలిమిలో గరళము కరగి కరగి యమృత మగును.'

చిత్రమేమంటే ఆమె ఒప్పుకొని అడ వేషాలు వేస్తుంది. ఆ నాటకాలు చూడడానికి రావద్దని భర్తను నిషేధిస్తుంది. చివర కొకసారి దొంగతనంగా చూడ వస్తాడు. అది మృచ్ఛ కటిక నాటకము. వసంతసేన పాత్రగా రాధ చారుదత్త పాత్రధారుని కౌగిలించుకోబోతుంది. అది చూచి గోపాలుడు వారిద్దరి మధ్యకు వచ్చి అడ్డు నిలవడంతో కథ ముగుస్తుంది. కథలు ఆరంభించడంలోనూ ముగింపులోనూ కూడా

వాకచక్యము ఉన్నది వారికి.

ఈ విధంగా చెప్పుకుంటూ పోతే ఎన్నయినా ఉన్నవి. కథలలో చాలా పాత్రల పేర్లు వింతగా ఉంటవి; కాని ఎక్కువ భాగ మవి సార్థక నామాలు. విషాదాంతమైన 'పద్మాక్షి' (భా. 4-6) గాథలో నాయిక అంధురాలు. 'దత్తు' (భా. 5-4) లో పిల్లలు లేని దంపతులు దుర్గ అనే పిల్లను ప్రేమతో లాలిస్తూ ఉంటారు కాని, ఆ పిల్ల తండ్రి దూరము చేస్తాడు. తుదకు దుర్గ కనక విగ్రహము పూజాస్థానములో వెలుస్తుంది. 'సదాచారుడు' (భా. 5-6) లో పూర్వాచార పరాయణుని పేరు ప్రతీకుడు!

శివరామశాస్త్రి కథలలో 'వావి' (భా. 5-3) ఎంతో మంచిది. 'పితల్ కా దర్వాజా' అందరి మెప్పు పొందినది. 'డిప్రెషను-చెంబు' శివ శంకరుల సంపాదకత్వాన వెలువడిన ఢిల్లీ సాహిత్య అకాడెమీ వారి 'కథామంజూషి' లో ఉచిత స్థానము సంతరించుకొన్నది.

వారి రచనలు ఎక్కువ భాగము 'భారతి' ద్వారానే ఆంధ్ర పాఠకలోకానికి పరిచయ మైనవి.

*  *  *

శివరామశాస్త్రికి భగవంతుడు ఉత్తమ లోక మనుగ్రహించు గాక!

'అథవా యోగినా మేవ
కులే భవతి ధీమతామ్
ఏ తద్ధి దుర్లభ తరం
లోకే జన్మ యదీదృశమ్.'

అన్న శ్రీకృష్ణ భగవానుల వాక్యము ప్రమాణము!



# వేలూరి - ఎలియట్

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు మన కిక లేరన్న వార్త వినిపించగానే ప్రాయశ్చిత్తంలేని పాపం చేసినవాడిలా బాధపడ్డాను. వారు లేరన్న వార్త అనుకోకుండా వచ్చిందేమీకాదు. ఇటువంటి వార్త ఎప్పుడో వినవలసివస్తుందని భయపడుతూ ఉన్నదే. పోయిన వేసవిలో ఒకసారి 'ఊళ్ళుతిరిగి ఉన్న ఆరోగ్యం చెడగొట్టుకున్నారుట'అని వారికి వ్రాశాను. వారు 'నేను ఊళ్ళు వెళ్ళలేదు. మఱి కారుమీఁద గుడివాడ (ఇక్కడికి 10 మైళ్ళు) మూఁడు రోజులు వెళ్ళి ఒక గంట అచటి ఆశ్రమంలో ఉపన్యసించి వెంటనే వెనుదిరిగి వచ్చాను. ఆ శ్రమ ఇప్పటికి తీఱింది.' అని వ్రాశారు. ఉత్తరం వ్రాస్తూ ఒకసారి మూడు పేజీల తర్వాత 'నాకు ఓపిక లేదు' అని, ఓపికచేసుకుని పది పేజీల ఉత్తరం వ్రాశారు: 'నేను ఈ యెండలకు బాగా నలిగి జీర్ణిస్తున్నాను. జ్ఞప్తి చాలాభాగం తగ్గింది. దౌర్బల్యం బలం చేకూర్చుకుంటుంది మనస్సులోనూ శరీరంలోనూ. అదీ ఒక శక్తేట — జరాశక్తి!' (21—6—1966.)

పోయిన అక్టోబరులో 'మీకు, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికి ఇక్కడి Young Lecturers సన్మానం చేయ దలుచుకుంది. మీరు సన్మానానికి హైదరాబాదు రావాలి' అని వారికి వ్రాశాను—అనుమానిస్తూనే. వారు వ్రాశారు '...నన్ను ఆహ్వానించినందులకు సంతోషం. లంఘనాలలో మనుగుడు పన్నట్లు నాకీ సమ్మానం. లేచి నా పనులు నేను నిర్వర్తించుకోవడమే కష్టంగా ఉన్నది. నేను పయనం చేయలేను. అంతకంటె రెండు మాటలు మాటాడలేను. ఈ స్థితిలో శ్రీ అనంతకృష్ణశర్మగారికిన్నీ శ్రీ సత్యనారాయణగారికిన్నీ సమ్మానంచేస్తే నాకు సమ్మానం చేయుడంకాదూ? అలా నేను సంతోషిస్తాను.'

ఈ సారి వేసవి శలవుల్లో వారిని చూచి రావాలి తప్పకుండా అనుకున్నాను. వేసవికి ముందే వారు శలవు తీసుకున్నారు.

శ్రీ సదాశివగారు నన్ను శ్రీ శాస్త్రిగారికి పరిచయంచేసి ఏడాది కాలేదు. ఈ కొద్దికాలంలో నన్ను వారు ఎంతో దగ్గరకు తీసుకున్నారు. నేను టి. ఎస్. ఎలియట్ కవితపై తెలుగులో ఒక చిన్న పుస్తకం వ్రాసి వారి సూచనలకొరకు పంపాను—

భయపడుతూనే. (అంతకుముందు ఎలియట్‌పై నా వ్యాసమొకటి భారతిలో వచ్చింది. ఆ వ్యాసాన్ని వారు చదివారట). వారికి సారస్వతంపై గల ప్రేమకు నిదర్శనం కావలిస్తే వారు నా కిచ్చిన ప్రోత్సాహమే చాలు. ఏ భాషలోని సాహిత్యాన్నైనా ఏ కాలపు సాహిత్యాన్నైనా ఒకే రకంగా చూడగలిగిన సాహిత్య దృష్టి వారికుంది. వారి కున్నట్లు మన తెలుగు వారిలో ఇంకొకరికి లేదు. ఎలియట్‌పై నా రచనలోని కొన్ని విషయాలపై వారు వాదానికి దిగారు. నేను కొంత నీరసపడ్డాను. శ్రీ సదాశివగారితో మొర పెట్టుకున్నాను. వారు వ్రాశారు: 'వేలూరివారు విమర్శించినందుకు బాధ పడుతున్నారా? వారు చేబూని విమర్శించటంకూడా అదృష్టమే అన్నసంగతి నేటి కొమ్ములు దిరిగిన కొందరు విద్వాంసులకు తెలియును...నా తరఫున పరిచయ మయ్యారు కనుక చనువు తీసుకుని విమర్శించారు. మీకు మీరే పంపితే బాగున్నదనేవారే –.'

శ్రీ శాస్త్రిగారు ఎలియట్ గురించి, ఎలియట్‌పైనా రచన గురించి నాకు కొన్ని ఉత్తరాలు వ్రాశారు. ఎలియట్‌పై శ్రీ వేలూరివారి ఆలోచనా ధోరణి తెలుసుకోవాలని కొందరికైనా కుతూహలం ఉండవచ్చునని వారి ఉత్తరాలలోనుండి సుదీర్ఘంగా ఉదహరిస్తున్నాను:

నేను మీ కంటె ముందు ఎలియట్ చదివి ఉంటాను, –కొన్ని Criticisms తోపాటు. కొన్ని సభలలో గూడా భారతీయ అలంకారికుల అనగా సాహిత్యవేత్తల దృష్టిలో అతని కవితను గురించి ఏమి చెప్పాలో (ఒకటి రెండు ఎలియట్ ఉదాహృతులతో) చెప్పాను. ఇది ఎందుకు వ్రాశానంటే మీ వ్యాసానికి ముందు ఎలియట్‌తో స్వల్ప పరిచయము నాకు ఉన్నదని. అంతేకాని 'మీకేం తెలుసు, పులుసు?' అని అనడానికి కాదు. నేను మీ కంటె ముందు చదివినా మీ వ్యాసం చూచి నేను వెనుకటికంటె ఎలియట్‌ను నిక్కంగా ఎక్కువ తెలిసికొన్నాను; ఎలియట్‌లాగా చెపితే—నిజం నిజం నిజం.'

ఎలియట్ ఏమి చెప్పాడు అన్నదిగాదు ఎలా చెప్పాడు అన్నది ప్రధానం అని వారికి ఒకసారి వ్రాశాను. వారు సమాధానంగా: భారతీయ సాహిత్య ద్రష్టలు అనగా ఆలంకారికులు అని తలుచు వాడుకొనబడేవారు చెప్పింది చెపుతాను—సహృదయ హృదయాహ్లాదం చెయ్యాలి కవి,' అని. ఆ ఆహ్లాదం కవి ఏంచేస్తే కలుగుతుంది? దీనికి సమాధానం వారు చెప్పింది—విభావాది సంయోగం (ఇది Broad గా చెప్పినమాట, చెప్పవలసిన మాట) 'విభావాను.... సంయోగాద్రస నిష్పత్తిః' అనేది నా(ట్య)ట్య శాస్త్రం లోది. 'సంయోగాత్' అనేదానికి తమతమ లక్ష్యానికి అనుగుణంగా తర్క సహకారంతో ఆయాయా వ్యాఖ్యాతలు వివిధంగా వ్యాఖ్యానాలు చేశారు. ఇది రసవాదం. ధ్వనివాదం రసవాదంకంటె వ్యాపకమేకాని రసం లందఅనూ కరగిస్తుందని పెద్ద లన్నారు. అందువల్లనే నన్నయ్యగారున్నా—'సిద్ధ్యేహిరసో...'— ఇత్యాదిగా లన్నారు. ధ్వనివాదులకు రసవాదంతో తగాదాలేదు. ఎంచేతనంటే రసం ధ్వనే కాబట్టి. సరే ఇక్కడ—విభావాదులు విషయం, సంయోగాత్ విధానం. విషయ విధానాలు రెండూ ఉంటేనే రస సిద్ధి అని ఈ భరతుని ఉద్దేశం.

'ఏమి చెప్పాడు' అనేది ప్రధానం కాదు' 'ఎలా చెప్పాడు' అనేది ప్రధానం అన్నవారున్నూ ఉన్నారు—ప్రాచీనులలోనూ నవీనులలోనూ. కుంతకాదులు ప్రాచీనులు. ఈ క్రిందివారు కొందరు— దీనికి రాయప్రోలు సుబ్బారావుగారు ఒక పద్యం పుల్లాకుమీద చెప్పారు—నీవు ఏ నందనవనంలోనో పుట్టావ్, అమృతంలాంటి ఏ తినుబండాన్ని మోశావు..' అని అంటూ. శ్రీ నారాయణదాసుగారు—

ఎగి రెగిరి పడ కెంగిలాకా
ఎనూ కాట్లకుక్క పీకా!

అంటూ ఎవనినో ఒక ఎంగిలి మనిషిని అపదేశిస్తూ. ఈ పాటలో హాస్యరసంకూడా ఇమిడి ఉన్న. కాని ఇలా విషయగౌరవం లేకుండా ఎన్ని కావ్యాలు ఎంత మంది కవులు వ్రాస్తారు? మచ్చుకు తలోటీ తలో కవీ వ్రాయవచ్చునని అనుకుందాం......కేవల ధ్వని వాదంలో విధానమే అంతర్గతమై ఉన్నది. కాని ఆ ధ్వని రసంతో పాటు ఔచిత్యం కోలుపోకుండా ఉండాలి అనే నియమం ఉన్నది. దాంతో ధ్వని కేవల విధానమునే ఆపేక్షిస్తుంది అనేవ్యాప్తికి మోరికి పట్టింది. ఈ సంగతి శ్రీ వెంకట శాస్త్రులవారు -'ధ్వని ధ్వని'

అని ఊరకే ధ్వని చేస్తారు ;—మలత్యాగం చేస్తున్నాడు అని ధ్వనించేట్టు కవి చెపితే అది యుక్తం అవుతుందా అని ఒక పద్యం చెప్పారు. అలా కాకున్నా ఇంకో అశ్లీలం వచ్చేట్టు వ్రాచిపట్టిన ఒక కోనేటితో సుఖవ్యాధులతో తీసికొను ఒకామెను ధ్వనింపజేశారు శ్రీ శ్రీ గారు ఒక పద్యంలో. ఇట్లాంటివి కావ్య గౌరవానికి ఆస్పదాలు కావని అనడానికి 'ఔచిత్య చారుణః' అని ధ్వనికారు డన్నాడు.'

ఎలియట్ కవితలోని obscurity గురించి, అర్థ నిర్ణయాన్ని గురించి శ్రీ శాస్త్రిగారు : ఆయన ఒక పద్యానికి ఇంకొక్క పద్యానికీ—కొంత పద్య శ్రేణికీ అర్థాన్ని ఎలా నిర్ణయిస్తారు.? అని. ఇతనివి 'ముక్తకాలు' కావుగదా! శాబ్దబోధ చెప్పితీరాలి. అందుకనే చాలామంది ఎలియట్ క్రిటిక్స్ సంకటంలో పడి, 'Nile' సందర్భంలో ఎప్పుడో ఒకానొకప్పుడు నైల్‌నదీప్రాంతాలలో వాడుక ఐన కొన్ని కొన్ని బొమ్మలను ప్రవాహంలో పడవేయడం దాకా చెప్పి చూచారు. అందులకనే 'జీవితః కవేః ప్రష్టవ్యం' అని అన్నారు మన విమర్శకులు,..... ఇట్టి అవ్యకాలు అనగా అర్థనిర్ధారణ చేయడానికి వీలులేనివి ముక్తకాలలో తగలవచ్చు. అట్టిది ధ్వన్యాలోకంలో ఒకటి చూపబడ్డది :—'లావణ్య ద్రవిణ వ్యయో న గణితః'—ఇత్యాది. మన విమర్శకులలో కొందఱు—శ్రోతకు తెలియని పద్యాలు చెప్పడం కవియొక్కయే జాడ్యం' (వక్తురేవహి తజ్జాడ్యం శ్రోతా యన్నావ బుధ్యతే') అని కాబోలును అన్నారు. ఈ అందఱు (కవులయు విమర్శకులయు) అభిప్రాయాలలో కొంతపాలు న్యాయం లేకపోలేదు.

అసలు మనకూ అందఱకూ కావలసిం దేమిటంటే—ఇపుడు Critics ఇలా అర్థాలు చెప్తారే వారి కేమిటి అర్థబోధోపాయం? దాంతే, మిల్టన్‌లు చదవనివానికి వానిలోతీసికొన్న ప్రతీకలనుబట్టి అర్థబోధ ఎట్లా? (ఆమాత్రం చదువుకోనివాడు దీని కధికారి కాడని వీరారు సమర్థనం చేశారు. ఇందులో partial truth లేకపోలేదుగాని ఇది ఎలియట్ విషయంలోనే కాబట్టి ప్రత్యేక పాంకేతికం కిందికి రావా?). Waste Land లో కాంబోలు ఎలియట్ కారాకులు థేమ్స్ ఒడ్డున వడినప్పుడు సన్నని గీఅలుగల ఆ యాకులు (రేఖాయుకాలయిన హస్తాలతో పోలినవి కాబట్టి) ప్రవాహపతితాలు కాకుండా పట్టుకొని ఉన్నటుల వ్రాశాడు అక్కడ. P Lost లో మిల్టన్ వర్ణించిన—కారాకులు పాపులు కింద అనగా నరకంలో పడ్డట్లు పడ్డాయ్' లనే అర్థంకల వర్ణన గురుతు వస్తుంది ఎలియట్ పెద్దపెద్ద నగరాలలో పొగగొట్టాల పొగను పిల్లులకు పోలుస్తాడు. మన పురాణాలలో దేంట్లోనో నేను సరిగ్గా దీనినే చూచాను*—ఇంతే. * వాళ్ళు అనగా దాంతే మిల్టనాదుల వాక్యగ్రహణమాత్రం చేత అర్థబోధ కావడం అనేది వ్యాపకం కాదు అని తెలిసినవాళ్ళలో కొందఱకు ఈ ఎలియట్ అర్థం లేదు- నహి ప్రతిజ్ఞా మాత్రేణ అర్థసిద్ధిః.

(నేనే దీనికి ఎదురు ప్రశ్న వేస్తాను,—అతి ప్రాచీనాలై ఎప్పుడూ వినబడని జర్ఫరీ తుర్ఫరీ వంటి శబ్దాలుకల ఋక్కులకు అర్థబోధోపాయం ఏమిటి? ఈ పదాలకు దాపుగాఉన్న ధాతువులు చూచి ప్రత్యయాలు కొన్నిపాతవి కొన్నికొత్తవి చేర్చి పూరించి యజ్ఞాలలో వాడుతున్న వానిని కనుక్కొని భాస్కర విద్యారణ్యాదులు నమ్మడానికి వీలులేని అర్థాలు చెప్పి చూచారు. కొన్నిఅర్థాల యెడ వారికే నమ్మిక లేదు. శ్రీ అరవిందులు సైకాలజీ అవలంబనంతోనూ Mystic experience తోనూ కొత్త అర్థం చెప్పారు. శ్రీ రాధాకృష్ణన్ ఈ నవీనార్థాన్ని అంగీకరించనని Indian philosophy మొదట దీని విచారణ చేశారు!)

అర్థనిర్ణయం విషయంలో కావ్యంలో అర్థం కేవలం శబ్దనిష్ఠంకాదని కొంత బుద్ధినిష్ఠం కూడానని, కనుకనే తన కావ్యానికిగాని పద్యానికిగాని ఇదీ అర్థమని నిర్ధారించగల అధికారం కవికి ఉండదని వ్రాశాను. దానికి వారు : 'పాఠకుల మనస్సులోని intellectual stuff కూడ కవి పద్యోద్దేశంతో కలుస్తుందనే మాటను chisel చేసి మన ఆలంకారికులు సహృదయుడు కావాలి

* శ్రీ శాస్త్రిగారు ఒక ఉత్తరంలో 'నాకు ఇంగ్లీషు సరిగా రాదు. సంస్కృతమూ అంత మాత్రమే అనుకోండి' అని వ్రాశారు.

పాఠకుడు అని అన్నారు. (కవి హృదయం) ఊహ ఎరిఁగిన పాఠకోత్తముల్ అన్నారు తెలుగు కవులు.'

'ఎలియట్‌కు తమకు తోచిన అర్థాలు చెప్పి ఎలియట్ కవిత్వాన్ని అందరికీ అందుబాటులోకి తెచ్చాక రసమో, భావమో, ధ్వనో, వాచ్యచమత్కార విశేషమో సరస్వతియొక్క ఏ బీరువాలో ఎక్కి కూర్చుంటుందో చూదామని నే ననుకుంటున్నాను' అని వ్రాశారు వారు.

సాహిత్యాన్ని బహుముఖమైన రాజకీయాలలోని ఒక ముఖంగా కాక, ఒక తపస్సుగా భావించినవారు శ్రీ వేలూరివారు. వారి సాహిత్య జిజ్ఞాస విశ్వ సాహిత్యాన్ని ఆలింగనం చేసుకుంది. నన్నయ్యను, ఎలియట్‌ను, అమ్మర్‌ను ఒకే దృష్టితో చూడగలిగిన వారు తెలుగుదేశంలో చాలామంది లేరు. శ్రీ శాస్త్రి గారు పండిత లోకంలో ఒక శిఖరం—కాదు ఒక శిఖరశ్రేణి. దానికి ఔన్నత్యమేగాని ఔద్ధత్యం లేదు; గాంభీర్యమేగాని దంభం లేదు; సహృదయతే కాని అసహనంలేదు. అటువంటి మహనీయుని చూచే భాగ్యం లేదని తెలిసి అలా బాధ కలిగింది.

—శ్రీ రాధాకృష్ణమూర్తి.



# ఈ గీతం

డా॥ మాదిరాజు రంగారావు

స్వాగతం పలికిన మీకు—
ఈ వేదిక నలంకరించి ఉన్న
తరుణ మనస్కులు ఉత్సాహకళికలు!
మనోభూమికలలోని
రహస్య గవేషణ మతులు!
భౌతిక జగత్తులోని
పరిణామ విచారణ చణులు!
ఈ గీతం వినిపిస్తున్నాను.

గతంలోని ఔజ్జ్వల్యం
వర్తమాన వాస్తవికత
భవిష్యత్తు స్వప్నరూపం
చింతనలో, అనుభూతితో
అధివసించి ఆకారం దాల్చిన
కళారూపం ఈ గీతం
నే నెందుకు వినిపిస్తున్నాను?

అపశకునపు ఘూళలు, ఉద్రేకపు ఉరుపులు
గుండ్రాళ్ల దొర్లింతలు, గులకరాళ్ల కలవరింతలు
ముళ్లకంపల ఈడ్పులు, నిదురలో కలవరింతలు
సుడిగుండాల తిరుగుళ్లు, ఆవలింతలు, త్రేన్పులు
ఒకటేమిటి? ఇలాంటివి శబ్దించే
యంత్ర భ్రమణం నియంత్రించడానికి,
అవి ఇష్టంలేని వారి కొక వేదిక కల్పించి
అవి నిదురలో వినేవారిని మేల్కొల్పదలచి
ఈ గీతం వినిపిస్తున్నాను.

ఈ చైతన్య జగత్తుకు అవరోధంగా
మృత్యువు ఎప్పుడూ ఎదురై నిలుస్తుంది.
బీజనాశనంనుండి మొక్క

పుష్పపతనంనుండి ఫలరూపం
తమస్సునుండి ఉష ఆగమనం, సహజం.
వస్తువు ఒక రూపం పోయి,
మరో రూపం ధరిస్తూ ఉంటుంది.
మార్పు నడిమికాలమే మృత్యువు.

శవాలు తగులబెట్టబడిన శ్మశానాలు
శవాలు పాతిపెట్టిన భూస్థలాలు,
భౌతిక రూపాల గొప్ప మార్పుకు స్థానాలు.
ఆనందానికి దుఃఖానికి
ప్రతీకలైన జీవనం, మృత్యువు
నిరంత సృష్టి ముఖాని కిరుపార్శ్వాలు.

ఈ శాబ్ద పరంపరా రూపం
పరాకాష్ఠ దశలో మృత్యువుగా
ఎదురౌతున్నది.
ఇది మార్పు రూపాలలో ఒకటిగా
ప్రవతారిస్తున్నది లోకాన్ని.
ఒక విధంగా చెబితే మృత్యువు
గతంయొక్క వర్తమాన రూపం.
అయితే వెలుగు ఊహ రాని
చీకటి బొయ్యారం, కాదు గతం.

రోజా రాత్రి గర్భంలోకి
నన్ను ప్రవేశింపజేయ చూస్తుంది మృత్యువు.
నేను లోనికి జని నిదురపోయి
స్వప్నచిత్రాలు చిత్రించి
ఉదయం మేల్కొని బయటికి వస్తాను.
అప్పటివరకే, తరుమబడి
చీకటిలోయలో దాగిఉంటుంది,
ఇంతమాత్రానికే భయపడి
మృత్యువు పేరు విని సామాన్యులు
సగం చచ్చిన బ్రతుకు గడుపుతారు.

ఓ మృత్యురూపమా!
చీకటి చిమ్ము గత కాలమా?

ఒక విషయం చెప్పాలి నీతో.
నా కాళ్ళు నేలలో పాతుకపోయి ఉన్నాయి.
నా హృదయం భూమి గుండెకు హత్తుకొని ఉంది.
ఈ భూమి ఎంతో ఆర్ద్రమైంది.
ఎప్పటికైనా ఇంత స్థానమిచ్చి
తనలో లీనం చేసుకునేది.
ఆకాశంపై విశ్వాసం లేకపోలేదు.

నాకు తెలుసు బ్రతుకులో
మధ్య దారిలోనే
తొండవలె వేచిఉండి
గ్రసింప జూస్తున్నావని.
నేను నిన్ను ఏలా తృప్తిపరచగలను?
ఇది నీ దురదృష్టంకాక మరేమిటి?
ప్రస్తుతం వినిపిస్తున్నదానికి
అడ్డురాకుండా ఉంటే అంతే చాలు!
ప్రక్కనే చేరి రాతిబండలు దొర్లించకు.
ఇదేమంటే నా పని నేను చేసుకుంటున్నానని
ఎవో కుంటి కొంటె సాకులు వినిపించకు.

అందరినీ కష్టపెట్టడానికి
వేసిన ఎత్తు కాదిది.
ఎవరినో సంతోషపెట్టడానికి
కనిపెట్టిన చిట్కా కాదిది.

శిశిరం వస్తుంది నీ ప్రభావంతో
తరువాత వచ్చేది వసంతం అని మరవకు.
రాత్రి వస్తుంది, నిదుర ఆవరిస్తుంది నిజమే.
ఉదయ మవుతుంది. మేల్కొనడమూ జరుగుతుంది.
ఈ చక్రనేమిక్రమణ నిరంతర గతులు
ఎవరి కనుకూలంగా వా రన్వయించుకోవద్దు.

నాకు తెలుసు మృత్యువు
నా చెప్పుచేతల్లో లేదని
నాకు తెలుసు మృత్యువు
శాశ్వతము, స్వతంత్రము కాదని

శాశ్వతము, స్వతంత్రము, అనంతము ఐన
చైతన్యపు టంశనని నాకు తెలుసు.

అలా విరుచుకపడతావెందుకు?
సముద్రంపై అగ్నివర్షంవలె
అద్దాలవంటి నా కనుచూపులలో
నీ రూపం ప్రతిఫలిస్తూనే ఉంది.

ఆకాశంవలె విచ్చిన చెవిలో
నీ గమనం శబ్దిస్తూనే ఉంది.
రోదసివలె నిలచిన మనస్సులో
ఊహలు గాలులవలె
అనుభవింపజేస్తూనే ఉన్నవి.

ఊడలు దిగిన మర్రిచెట్టువలె
ఏమాత్రం కదలవు మెదలవేం?
కలలో జడలు రేగిన పెనుభూతంవలె
అంతలో రూపుమారిపోయావేం?

'గుడ్‌మార్నింగ్' అంటూ వచ్చి
గుడ్‌బై చెప్పకుండానే వెళ్లవచ్చు

ఒక్క గాలితెర వీస్తే
గొప్పతనం తెలియవచ్చే
సముద్రం, నా కంటికి
చిక్కని హాస్యపు నురుగుతో
ఉన్న మాటల తరగలతో
ప్రపంచ నాటకశాలలోని
గొప్ప హాస్యపాత్రవలె కన్పిస్తాడు.
నీ తలపుల తలుపులు మూసి
ఆటకట్టి వెళ్లిపోతూపోతూ
నాపై చూపే ప్రేమ ఏముంది?
ఒక గులాబీ పుష్పం
నా శిరస్సుపై ఉంచుతున్నావు!
చుట్టూ ఉన్న కంటకాలు
గుచ్చుకుంటాయన్న ఊహతోనేనా?

అడవిలో,
క్రూరకిరాతక చర్యకు బలియైన,
ముగ్ధముగ్ధంగా కాలాన్ని కత్తిరిస్తూ
ఎగిరే హరిణశాబకం నెత్తురుతో
ఈ గీతం వ్రాస్తున్నాను.

వనంలో,
విపరీతపు గాలిచే విశీర్ణమై
సౌందర్య పరిమళభరితమై
కాలాన్ని మరపించే పూవుల
మధుపరాగ రేఖలతో
ఈ గీతం చిత్రిస్తున్నాను.

తల్లి కలల కానందరూపం కల్పిస్తూ
బ్రతికి బట్టగట్టి కాలాన్ని జయించే
శిశువు హృదయ రూపంతో
ఈ గీతం స్పందింపజేస్తున్నాను.

వర్షధారలు భూమిలో విలీనమైనట్లు
గాలిపిల్లలు దిశల చెరగులలో దాగినట్లు
వెలుగు కత్తులు రోదసి గుండెలో చొచ్చినట్లు
శబ్దరేఖలు గగనవీధి పరుగిడినట్లు

నా మాటలు—మనస్సులో పొరలు దాటి
అంతరాత్మలో అర్థవంతాలై
మానవ జీవన వ్యూహంలో
అమృతకాంతి వర్షంతో
నవనవోన్మేష సృజనాకృతి,

ఆనందం నదింపజేసే
అనుభవం స్పందింపజేసే
సహృదయ మనః ప్రీతి పరమ
కవితాగీతం, ఆవిష్కరిస్తున్నాను.

# పాశ్చాత్య ప్రపంచంలో మార్క్స్ దర్శనం 6

శ్రీ సిడ్నీహుక్

హెగెల్ వంటి చారిత్రక ప్రత్యయవాదులలో కూడా ఈ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతం వుంది. వారు, దానిని గురించి ఒక విధంగా ఆలోచించారు. దానికి ఒక పద్ధతి అర్థం కుదిర్చారు. చారిత్రక పదార్థవాదులు ఈ సిద్ధాంతాన్ని గురించి చూపించిన విప్రతిపత్తి ఇచ్చట అనువర్తించదు. సహజసిద్ధమైన ధర్మం నుంచి వ్యత్యయం చెందడం ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానమని, ఈ పదార్థ సిద్ధాంతులు భావించారు. కాని హెగెల్ మొదలయినవారికో అట్లా కాదు. వారి సిద్ధాంతంలో "అనుభవాత్మ" (లేక వ్యావహారికాత్మ) ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం వలన పెరిగి పెరిగి తుదకు "పరమార్థ ఆత్మలో" (లేక సమస్త ఆత్మలో) లయించి పోతుంది. ఈ పరమార్థాత్మ లేక సమస్తాత్మ భగవంతునికి ప్రత్యామ్నాయంగా పనిచేస్తూ వుంటుంది. అందువల్ల పదార్థ వాదులు ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన్ని గురించి, పదార్థ సిద్ధాంతులు చెప్పే అభ్యంతరం ఈ కారణం చేతనే ఇచ్చట వీరియందు అనువర్తించదు. ప్రత్యయ సిద్ధాంతులలో ఈ పద్ధతిని అంతా ఒక ప్రయోజన ధర్మం అదుపులో వుంచుకుంటున్నది. ఇచ్చట, దిష్టికి, లేక అదృష్టానికి స్థానమే లేదు. వైయక్తిక నిర్ణయం, వస్తు నిష్ఠమైన అవకాశం, అచ్చమైన చెడుగు మొదలయినవి కూడా ఇచ్చట వుండవు. హెగెల్ యొక్క ప్రభావం నుంచి మార్క్స్ తప్పించుకోలేక పోయాడు. తన మొదటి గ్రంధాన్ని వ్రాస్తున్న రోజులలో మార్క్స్ మీద హెగెల్ ప్రభావం ఆయన ఎంత వద్దనుకున్నా అధికంగా కనిపిస్తూ వచ్చింది. ఆ తరువాత, మార్క్స్ తన ఆలోచన క్షేత్రాన్ని మార్చుకున్నారు మానవీయమైన ఆదర్శాలను వదును పెట్టకుండా సమాజ సమీక్షకు ఆయన పూనుకున్నారు. స్వసాక్షాత్కారం తాలూకు నీతి వాదాలను వదలిపెట్టి ఆయన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ యొక్క అభివృద్ధి పద్ధతిని, అనుభవ ప్రాతిపదికను వివరించడానికి పూనుకున్నారు. ఇచ్చట ఆయన కృషి యిది. ఇచ్చట ఏ విధానాలను, కార్యక్రమాలను అవలంబిస్తే సమాజ విప్లవం సాధ్యమవుతుంది? ఆ విప్లవం నుంచి నవ సమాజ ధర్మం ఏర్పడి ఉచితజ్ఞుడైన మానవుడు ఆవిర్భావం చెందుతాడు? ఈ విషయాలను తెలుసుకోవాలని ఆయన తన అనంతర కాలంలో విజిజ్ఞాస చేశారు.

"కమ్యూనిస్టు మానిఫెస్టో"లో ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతం తాలూకు భాషాభేషజాలు కొంతవరకు కనిపిస్తాయి. "దాస్ కాపిటల్‌లో" కూడా ఈ సిద్ధాంతం చిహ్నాలు వున్నాయి. ముఖ్యంగా వస్తు సంచయాన్ని గురించి చెప్పిన అధ్యాయంలో ఈ విషయం కనిపిస్తుంది. కాని, ఇచ్చట, మార్క్స్ అర్థం, భాష రెండూవేరు. మార్క్స్ పెద్దవాడయిన కొద్దీ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానాన్ని నిరోధించడానికి సహేతుకమైన లేక ఉచితంగా కనిపించే మార్గాన్ని ఆలోచించారు. పని కాలం పొడవును తగ్గించడం, అధికారంలో పరివర్తనం తెచ్చి పెట్టడం మొదలైన పద్ధతులను ఆయన ఆలోచించాడు.

ఇచ్చట నేను చెప్పదలచుకున్న విషయాలు ముఖ్యంగా రెండు. ఒకటి మార్క్సిజంను గురించి

ఇప్పుడు బయలుదేరిన అవిరళోత్సాహానికి ప్రోద్బల మంతా మార్క్సస్ ఆర్థిక ప్రపంచం సర్వమైన రహస్యమున్నూ మానవ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానంలో వున్నదన్న వూహాపోహవల్ల కలిగింది. రెండు:— ఈ రకమైన వూహాపోహ మార్క్సస్ పెద్దవాడయిన తర్వాత చేసిన సర్వమైన విచార ధారకున్ను పూర్తిగా విజాతీయ మైనది.

మార్క్సస్ యొక్క సర్వతాత్త్విక చింతన కున్నూ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానం కీలకం అనే భావం ఒక్క మార్క్సిస్టులలోనేకాక మార్క్సిజంను పట్టి దబ్బరగా భావిస్తూ వున్న పండిత ప్రకాండులలో కూడా వుంది. "కమ్యూనిస్టు మానిఫెస్టోలో" కారల్ మార్క్సస్ స్వయంగా ఈ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతాన్ని పదార్థేతర వాదం తాలూకు కశ్మలమనిన్నీ బుద్ధిజాడ్యజనితోన్మాదమనిన్నీ అభివర్ణించి వున్నాడు. ఈనిగమనంతో అంగీకరించక ప్రొఫెసర్ రాబర్ట్ టక్కర్, తను వ్రాసిన "Philosophy and Myth in Karl Marx" లో ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతం కారల్‌మార్క్స్ పరమ సిద్ధాంతమైనట్టు వ్రాశారు. "మానవ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానమున్నూ, దానిని నిరోధించి జయించడమున్నూ మార్క్సస్ సిద్ధాంతాలలో పరమమైన సిద్ధాంతం. మార్క్సస్ సిద్ధాంత ప్రపంచానికి ఇదే ప్రాతిపదిక."[16] ఈ విషయాన్ని గురించి టక్కర్ తన గ్రంథంలో వివరిస్తూ, ఈ సిద్ధాంతాన్ని ప్రపంచించడంలో మార్క్సస్ ఎంతో అంతర్దృష్టిని ప్రదర్శించారని అంగీకరించినా, అనంతర మార్క్సిస్టులవలె దానినే పరమ సిద్ధాంత మనక అది పట్టి డబ్బర అని తేల్చివేశాడు. మానవ ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానానికి అసలైన జనిస్థానం ఏమో, దానియొక్క ఉనికి ఎక్కడో మార్క్సస్‌కు సరిగ అర్థం కాకపోవడంవల్ల ఆయన సిద్ధాంతం దెబ్బ తిన్నదని అన్నాడు. మనుష్యుని యొక్క ప్రకృతి సిద్ధమైన స్వభావాన్ని వికిరపరచే విజాతీయమైన శక్తి ఒక టున్నది. ఆ శక్తిబారినుంచి తప్పించుకొని విముక్తిని పొందడానికి మానవుడు పోరాటం సాగించవలసివుంది. ఆ విజాతీయమైన శక్తిని నిరోధించవలసివుంది. ఆ శక్తి మరి ఏమీ కాదు. అది మానవునిలో వున్న లోభమూ, అహంకారమూ, స్వార్థపరత్వమూ అన్న లక్షణాల కూడిక. ఇది మానవుని యొక్క అంతరంగాత్మ. ఇచ్చట ఆంతరంగికమైన విప్లవం అవసరం అవుతూండగా మార్క్సస్ దాని స్థానే సమాజ విప్లవ కార్యక్రమాన్ని తెచ్చిపెట్టి పొరపాటు చేశాడు. ప్రొఫెసర్ టక్కర్ లెక్క ప్రకారం అసలైన చెడుగు పెట్టుబడిదారీ పద్ధతి కాదు. అసలైన చెడుగు మానవుని మమా, మానవుని లోభమూ, మానవుని అహంకారమూను. వీని నుండి మానవునికి విముక్తిని కలిగించవలసి వుంది.

ప్రొఫెసర్ టక్కర్ చెప్పిన ఆత్మ ధర్మ ప్రత్యాఖ్యానానికి మనం ఇచ్చట సమాధానం చెప్పనవసరం లేదు. ఈ రకమైన విచారధారను మార్క్సస్ స్వయంగా క్రైస్తవమత విశ్వాసంతో పూర్వపక్షం చేసే వున్నాడు. ఆ తరువాత స్టిర్నర్, బెంథామ్ కొంత వ్రాశారు. ఇచ్చట మనము టక్కర్ వాదంతో ఒక్క విషయమే మనం చూడవలసి వుంది. నేను పైన ఒక ప్రశ్న వేశాను. "ఏ యథార్థమైన ఆత్మ లేక ధర్మం నుంచి, లేక ఏ సహజమైన ఆత్మ లేక ధర్మం నుంచి మానవుడు ప్రత్యాఖ్యాతుడైనాడు?" మార్క్సస్ పద్ధతిలో ఈ ప్రశ్నకు సమాధానం వున్నదని ప్రొఫెసర్ టక్కర్ వాదిస్తున్నారు. అదేమిటో ఇచ్చట మనం పరిశీలన చేయవలసివుంది. టక్కర్ గ్రంథంపై విమర్శలు వచ్చాయి. ఆ విమర్శలకు టక్కర్ సమాధానం ఇచ్చుకున్నారు. తన గ్రంథాన్ని సమర్థించుకున్నారు. మానవ స్వభావాన్ని గురించి మార్క్సస్‌కు వున్న నిష్కర్షమైన భావాలలో చరిత్ర వ్యవహార సిద్ధమైన విషయమున్ను, పారమార్థికమైన విషయమున్నూ, పారమార్థికమైన పద్ధతి యున్నూ వున్నవని ప్రొఫెసర్ టక్కర్ అభిప్రాయం పడుతున్నారు. మానవుని వ్యావహారిక స్వభావం సమస్తోత్పత్తి పద్ధతిలోని మార్పులవల్ల పరిణామంచెందుతూ వుంటుంది; మార్పులు పొందుతూ వుంటుంది. పోతే మానవునిలోని పరమార్థస్వభావం "కృషి శక్తి కలిగిన పశువు వంటిది. అది ఒకరకమైన జీవశక్తి

16. Robert Tucker, philosophy and Myth in Karl Marx. (Cambridge University press, 1961 P P 238).

కలిగినది. ఒది స్వభావంచేత స్వయంసంపూర్ణతను లేక స్వయంసమగ్రతను సంపాదించవలెననే ఆశ, జిజ్ఞాస కలిగినటువంటిది. సమగ్ర ఆత్మార్పణం కూడ ఈ జీవస్వభావ లక్షణం. ఈ క్రియ వస్తూత్పత్తి కార్యరంగంలో జరుగాలని ఈ జీవి వాంఛిస్తుంది. ఈ క్రియ అంతా నిర్బంధం లేకుండా, అచ్చమైన స్వాతంత్ర్యంలో జరుగాలని అనుకుంటుంది.''

మనుష్యుని యొక్క వ్యావహారిక స్వభావానికి మనుష్యుని యొక్క పారమార్థిక స్వభావానికి మధ్యే ఎంచబడిన ఈ తేడా మార్క్స్ దృష్టిలో తుచ్ఛం; అనగా యదార్థ విషయం కాదని అర్థం. మొదట మనుష్యుని స్వభావంలో కనపడే విషయానిని దేనినీ ఇది అభివర్ణించి చెప్పడంలేదు. ఒక లక్ష్యాన్ని చెబుతూంది. మనుష్యుడు ఎట్లా వుండాలో చెబుతున్నది. అంతేకాక వర్గసమాజాలలో మానవుని యొక్క పారమార్థిక స్వభావం ఆవిర్భావం చెందేదెట్లా? వర్గధర్మ దుష్టమైన మానవసమాజ చరిత్రలో అంతిమ దశలో ఈ స్థితి ఆవిర్భవిస్తుందా? ఆవిర్భవిస్తే అది ఎట్లా జరుగుతుంది? ఇంతవరకు అనేక సమాజాలు ఉద్భవించాయి. అంతరించాయి. ఈ ఏ సమాజంలోను మానవుడు స్వతంత్రంగా వస్తూత్పత్తి క్రియాకలాపం ఆచరించి స్వయం సమగ్రతనుగాని ఆత్మార్పణంగాని పొంది వుండని సందర్భంలో ఇది ఎట్లా జరుగుతుంది? ఏది పరమార్థమో, అది ఆదినుంచి వునికిలోని వుండాలి. ప్రొఫెసర్ టక్కర్ మానవస్వభావంలో ఎచ్చట, వ్యావహారిక స్వభావమని పారమార్థిక స్వభావమని భేదాన్ని ఎంచుతున్నారో, అచ్చట వానిని మార్క్స్ నిరంతరమైన పరస్పర అంతస్సంఘట్టనముగా భావిస్తున్నారు. అంటే, మానవుని యొక్క జీవసంబంధమైన, స్వభావానికిన్నీ సామాజిక చారిత్రక సంబంధమైన స్వభావానికిన్నీ విస్పష్టమైన భేదాన్ని ఎంచడానికే మార్క్స్ ఇచ్చట తిరస్కరిస్తున్నారు. మానవుని యొక్క మనస్సంబంధమైన తత్త్వం సమాజ సంబంధమైన మనస్తత్వంలో ఐయిస్తున్నది. అంతేకాక మానవుని శరీర ధర్మం కూడ తీవ్రమైన మార్పులను చెందుతూంది. మార్క్స్ ఏ పుస్తకాలు పఠించి మానవుని వ్యవహారిక పారమార్థిక స్వభావద్వైత సిద్ధాంతాన్ని స్థాపిద్దామని ప్రొఫెసర్ టక్కర్ ప్రయత్నించారో, ఆ గ్రంథంలోనే కారల్ మార్క్స్ ఇలా వ్రాశారు:

''మనుష్యుడు సమాజజీవి, సమాజ జీవి కాదు' సమాజ జీవి అయిన మానవుని యొక్క విషయ జ్ఞానం, లేక ప్రజ్ఞానం సమాజజీవి కాని మానవుని ప్రజ్ఞానం కన్నా విభిన్నమై వుంటుంది. వస్తునిష్ఠమైన అభినివేశంతో మానవుడు అనే జీవి అభివృద్ధి పరచుకొన్న సర్వమైన సంపత్తు ద్వారానే ఆత్మనిష్ఠమైన వ్యక్త్యభిరుచివిశేషం ఆదిలో సృష్టిని పొందింది. ఆదిలో అలవరచుకొనబడింది. అనగా అభిరుచిని పెంపొందించుకొన్నదన్న మాట. సంగీతాన్ని విని ఆనందించగలగడం, అందమైన ఆకారం చూచి కన్నులకు తర్పణం చేసుకొనడం—ఇట్టివి. అనగా, మానవుని తృప్తికి సమర్థములైన, మానవునియందు సారభూతమై వున్న సర్వమైన శక్తులకు అస్వర్థతను చేకూర్చగల పంచజ్ఞానేంద్రియాల విషయం ఇచ్చట చెప్పబడుతున్నది. ఇచ్చట ఈ ఐదయిన జ్ఞానేంద్రియాలే కాక ఆధ్యాత్మ సంబంధమైన ఎరుకయు, అనుభవ విషయములు (ఇచ్ఛ ప్రేమ మొదలయినవి) వున్నవి. వీటినన్నింటినీ కలిపి ఇంగితం అంటున్నాను. ఇది ఇంద్రియాల వలననైన మానవుని స్వభావవిశేషం. మానవుని జ్ఞానేంద్రియాల మానవీయ చరిత్ర. వస్తునిష్ఠంగా దానియొక్క వునికి అన్నది వుండడం చేతనే ఇది ఆవిర్భావం చెందుతున్నది. మానవీకృత స్వభావంలో స్థితిని పొంది వుండడం చేతనే, ఈ ఆవిర్భావం. పంచజ్ఞానేంద్రియాలకు శిక్షగరపడమే గత చరిత్ర చేసిపెట్టిన పని.''

కమ్యూనిజంలో ఏ విధమైన బాధలయిన వుండవచ్చునని అంగీకరించడానికి మార్క్స్‌కు ఏరకమైన అభ్యంతరమూ లేకపోయి వుండవచ్చు. అట్లా అంగీకరిస్తే, ఆ బాధలు పెద్దగా బాధ పెట్టేవిగా వుండవని ఆయన అనుకుని వుంటాడు, లేదా ఇతర సమాజాలలో వలె అవి వుండవని అనుకుని వుంటాడు. హెగెల్, ఫ్యూర్‌బాక్‌లు ఇద్దరూ కొన్నివిషయాలు చెప్పారు. ఆ విషయాలను మార్క్స్ విపరీతమైన దూరాలకు కాల్పనికమైన లోకాలకు పట్టించుకు

పోయాడు. ఏది ఏమైనా, ఇచ్చట తెలుస్తున్న విషయం ఇది. పైన వుద్ధృతపరచిన వాక్యాల వల్ల మానవుని వ్యావహారిక పారమార్థిక స్వభావాలకు భేదాన్ని ఎంచడం చెల్లదని నిరూపణం అవుతున్నది. మానవస్వభావం గాని లేక మానవుని ఆత్మగాని, మార్క్సుకు కొత్త విషయాలు కావు. అవి దత్త విషయాలయితే విత్తు నుంచి చెట్టు కావడంగా సంతర్పణం చెందవలసి వుంటుంది. కాని మార్క్స్ ఆలోచన అట్టిది కాదు. మనుష్యునికి ఒక ఆత్మ వుందా? బహు ఆత్మలు వున్నవా? — అన్న విషయాన్ని గూర్చి కూడా మార్క్స్ కొంత చర్చించి వున్నాడు. వానిని సంభావ్యాదర్శం దృష్ట్యా కొంత పునర్నిర్ణయం కూడ చేసి వున్నాడు. మార్క్స్ ఆదర్శం మంచి సమాజంలో మంచి జీవనం. ఆ సమాజం ఆ జీవనం అత్యంతమూ ఉదాత్తమైనట్టివి. అచ్చట ప్రతిభావంతులు ఉపజ్ఞాదక్షులు అయిన మానవులు సంఘంగా సహకార జీవనం నెరపుచూ సౌందర్యాన్ని, సత్యాన్ని అన్వేషణ చేస్తుంటారు. ఆ అన్వేషణ కోసమే ఈ జీవనం సాగుతూ వుంటుంది. ఈ విషయాన్ని పైన సూచించి వున్నాము. ఇదే మార్క్స్ తత్వం అయినట్టయితే, ఆయన ఒక్కసంక్తి గ్రంథాన్ని గూడా వ్రాయవలసిన అవసరం కనిపించదు. ప్రొఫెసర్ టక్కర్ అభిప్రాయం కూడా యిదే. ఆయన యిట్లా వ్రాశారు.

"మార్క్స్. తాను ఇరవై సంవత్సరాలు కష్టపడి తన ఆరోగ్యాన్ని పాడు చేసుకొని జీవితంలో సుఖాన్ని త్యజించి కుటుంబానికి సుఖం లేకుండా చేసి, వ్రాసిన ఏ గ్రంథమయితే వున్నదో ఆ గ్రంథం "దస్ కాపిటల్" ఇప్పుడు మనకు మేధా ప్రదర్శనశాలగా మిగిలి వుంది. అయితే, 1844 లో మార్క్స్ 16 పేజీల గ్రంథం ఒకదాన్ని వ్రాశారు. అది అచ్చు కాలేదు. ఆ గ్రంథాన్ని ఆయన ఒక్క రోజులో పూర్తి చేసి వుంటారు. 'Aesthetics" (Economics ?) యొక్క భవిష్యత్తును గురించి అందులో మీమాంసించారు. అయితే, ఆ గ్రంథం ఆయనకు ప్రచురణ యోగ్యమని అనిపించలేదు. కాని, ఇప్పటికీ తెలియవలసింది ఏమన్నా వుందంటే ఆ గ్రంథంలో వుంది."

ఈ మాటలలో వున్న వైపరీత్యం సంగతి అలా వుంచుదాం. కాని, ఈ మాటలలో ప్రొఫెసర్ టక్కర్ మార్క్స్ తత్వానికి చేసిన వ్యాఖ్యానం నిలిచేది కాదని చెప్పడానికి సమర్థమైన ఉపపత్తి వుంది. అజ్ఞాతమైన మార్క్స్ రచనలలో ఆయన చెప్ప దలచుకున్న అర్థమంతా వుందని వాదించే పక్షంలో మార్క్స్ పేరు మీద, మార్క్స్ సిద్ధాంతాల పేరు చెప్పి బయలుదేరిన సర్వమైన వుద్యమానికిన్నీ ఆధారం ఎక్కడ? ఇదే ప్రశ్న.

విజ్ఞానానికి విద్రోహం చేసినందుకు జరిగిన విమర్శలకు విజ్ఞానం యొక్క యథాస్థితిని విజ్ఞానాత్మకంగా విమర్శించేందుకు కూడా మార్క్స్ చెప్పాడని చెప్పబడుతున్న ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సిద్ధాంతాన్ని దాని తెన్నూ లేకుండా, ఉపయోగించడం జరిగింది. అందుకోసం ఆ సిద్ధాంతాన్ని హేతువుకూ, ఆధారానికీ గడినించి పోయేవిధంగా వ్యాఖ్యానించడం పరిపాటి అయింది. ఇప్పుడు మార్క్సిస్టు "సిద్ధాంత ప్రపంచానికి" కూడా ఇదేరకమైన గతి పట్టేట్టు గోచరిస్తున్నది. అనతికాలంలో ఈ విషయాన్ని గురించి వినగలం. అయినా, ఇప్పట్టున, ఈ విషయాన్ని గురించి కొంచెం చెప్పవలసి వుంది. ఈ వ్యవహారంలో మార్క్స్ వదలిపెట్టి వేసిన ఒకానొక సిద్ధాంతానికీ లేక అభిప్రాయానికీ ప్రాణప్రతిష్ఠ చేయడం కాదు జరుగుతున్న పని. మార్క్స్ పెద్దవాడై పరిపక్వ మనస్కుడై, చెప్పినటువంటి విషయాలను తల క్రిందులు చేసి, వ్యాఖ్యానించడం ఈ జరుగుతున్న పనిలోని అంతరార్థం. ఈ పనిని చూస్తే, అందులో అసంగతి అనే పొరలు కనిపిస్తాయి. సిద్ధాంత ప్రపంచాన్ని గురించి మార్క్స్ కొన్నిమాటలు చెప్పి వున్నాడు. ఈ సిద్ధాంత ప్రపంచం అన్నది ఒకరకం నమ్మకాల లేక సిద్ధాంతాల కూడిక. సామాజికమైన, రాజకీయమైన అధికారం కోసం విభిన్నవర్గాల మధ్య సంఘర్షణ సాగుతూ వున్నప్పుడు, ఈ సంఘర్షణలో అవతలి వర్గముతో పోరాటం సాగిస్తున్న ఒక వర్గం యొక్క యోగక్షేమాలను, ఈ నమ్మకాలు లేక సిద్ధాంతాలు, క్రమబద్ధం చేయడానికి ఏర్పడుతున్నాయి. వీటన్నిటినీ మార్క్స్ "సిద్ధాంత ప్రపంచం" అన్నాడు. ఈ సిద్ధాంత ప్రపంచంలో ఆ సిద్ధాంత ప్రపంచాన్ని అవలంబించి వ్యవహరించే

వారి యోగక్షేమాలేకాక, ఆవతలివారి యోగక్షేమాల సంగతి గూడా నిగూఢంగా తెలియరాకుండా వుంటూ వుంటుంది. ఇది, ఆ సిద్ధాంతాలను అవలంబించిన వారికీ తెలియదు; వ్యతిరేకిస్తున్న వారికీ తెలియదు. ప్రతి చారిత్రక కాలవిభాగంలోను ఇది ఇట్లా వుంటూ వుంటుంది. ఇప్పుడు మార్క్సిస్ పద్ధతి చారిత్రక విమర్శ, సామాజిక విమర్శ యొక్క విధ్యుక్తధర్మం ఏమిటంటే, ఈ సిద్ధాంత జాలాన్ని విమర్శ చేయడమూ, ఈ సిద్ధాంత ప్రపంచం ధరించిన అవగుంఠనాన్ని తొలగించడమూ అయివుంది. ఇట్లా చేసినప్పుడు భగవంతుడు, దేశము, దేశగౌరవము, విశ్వప్రేమ, శాంతి, స్వాతంత్ర్యము, మొదలయిన నిరాకార సిద్ధాంతాలను, సిద్ధాంతాల వెనుక వున్న అర్కాన్ని బద్దలు కొట్టి ఆ పేరుతో జరుగుతున్న ఆర్థిక సంబంధమైన వర్గాల యొక్క పోరాటాన్ని ఆవిష్కరించడం అయివుంది. ఈ అభిప్రాయంలో మార్క్సిజమూ దాని అంతట అది సిద్ధాంతప్రపంచం కాదు. కార్మిక వర్గం యొక్క యోగక్షేమాలను నిజాయతీతో, అభివ్యక్తం చేసే సత్యధర్మం. ఈ విధంగా ఈ మార్క్సిజం సర్వమానవ లోకం యోగక్షేమాలను, ధర్మాన్ని, ఆర్థికధర్మ నైజాన్ని, పనిచేస్తేపద్ధతిని, దాని పతనాన్ని సశాస్త్రీయమైన ఉద్ఘాటనం ప్రాతిపదికగా నిరూపిస్తుంది. మార్క్సిస్టు అభిప్రాయంలో ఒక సిద్ధాంత ప్రపంచానికి మనస్సు చేత అచ్చంగా గ్రహించదగిన అర్థం అంటూ ఒకటి వున్నప్పుడు, అది దబ్బర అవుతున్నది. మనస్సు చేత గ్రహించబడడము గ్రహించబడకపోవడం సంగతి అట్లా వుంచినా సిద్ధాంత ప్రపంచం అనేదానిలో నిత్యమున్నూ నిదానయోగ్యమయిన అభిజ్ఞ వుంటూనేవుంది. అధికారం కోసం తిరుగుతూ వుండే సంఘర్షణల యొక్క యధార్థ స్థితి ఎట్లా నిర్వహించబడుతూందో తెలుసుకోడానికి యిందులో మార్గం వుంది. ఈ యధార్థ స్థితి నిర్వహించబడే పద్ధతులు రెండు వున్నాయి. ఒకటి బాహ్యమైన వంచన; రెండవది ఆత్మవంచనం. ఈ రెండవ కారణం మొదటి కారణం కన్నా సంగతమైనది. దానిని నమ్మేవారియొక్క ప్రవర్తనపైదాని ప్రభావం చెల్లుతూ వుంటుంది. అందువల్ల దానిని నిరోధించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

వర్తమానకాలపు మార్క్సిజం వున్నది. ఈ మార్క్సిజంలో సర్వమానవులను సమాజసంబంధమైన అవలక్షణాల భారంనుంచి విముక్తిని చెందించడానికి పద్ధతి చెప్పబడి వుంది. ఇచ్చట చెప్పబడిన అవలక్షణాలే మానవుని వైయక్తిక సమస్యలకు గూడ మూల కారణంగా భావించడం జరుగుతున్నది. ఇప్పుడు, సామాజికమైన ఈ అవలక్షణాల భారం నుంచి మానవజీవులకు విముక్తి కలగాలి అంటే ఆర్థికోత్పత్తి సాధనాలను సమాజాయత్తం చేస్తేనూ, కార్మికవర్గం ఆధారంగా సాధించబడే సమాజ విప్లవ మూలంగానూ సాధ్యమవుతుందీ అంటే, అందులో మూడురకాలయిన దబ్బర ఇమిడి వున్నదని చెప్పవలసి వుంటుంది. 17

1—పైన పేర్కొనబడినటువంటి విముక్తి ఉత్పత్తి సాధనాలను సమాజాయత్తం చేసినంత మాత్రంచేత తగినంత పరిస్థితి ఏర్పడడం లేదు. గాఢమూ, బాధమూ, శక్తివంతమూ అయిన ప్రజాస్వామిక వ్యవస్థలు పనిచేస్తూ వుండకపోయిన పక్షంలో ఇందుమూలంగా మార్క్సిస్ కలలో గూడ భావించి వుండనంతటి ఘోరమైన నిరంకుశత్వం ప్రాదుర్భావం చెందవచ్చు. ఈ నిరంకుశత్వం పెట్టుబడిదారీ సమాజంలో అనుభవితమైన నిరంకుశత్వం కన్నా గూడా హీనంగా వుండవచ్చు. సామ్యవాదంతాలూకు మానవీయాదర్శాలు చరితార్థం చెందడానికి సమగ్ర సమాజీకరణం ఆగత్య కారణం అని అనలేము. యాజమాన్య బహుత్వంగల మిశ్రమార్థిక వ్యవస్థలోనే అనపాయమైన పద్ధతిలో శ్రేష్ఠతర ఫలితాలు సాధించే వీలున్నది. ఈ మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో యాజమాన్యం జరిపే వారందరున్నూ కార్యకారణీ సంస్థలలో బాధ్యతవడి పనిచేస్తూ వుండడమూ, సర్వవ్యవహార మున్నూ స్వతంత్రమైన న్యాయస్థానాల పరిశీలనముకు లోబడి వుండటమున్ను వున్నప్పుడు సర్వము శ్రేయస్కరంగా శోభస్కరంగా జరిగే సావకాశం వుంది.

2—ఆర్థిక సమస్య అనగా, దారిద్ర్యాన్ని నిర్మూలించడం, దైహికమైన వాంఛలను లోపం లేకుండా

17. Reason, Social myth and Democracy (New Yark–1940) Sidny Hook. The Ambiguous Legacy, Marx and Marxists (New Yark 1985).

చేయడమూ బ్రతకడం కోసం అందరికిన్నీ సభ్యమైన కనిష్ఠ ప్రమాణాలను సాధించడమూ అనుకొని, దాన్ని సాధించినా కూడా ఆ తర్వాత పరిష్కారం కావలసిన సమాజ సమస్యలు ఇంకా మిగిలిపోతూనే వుంటాయి. ఇవి గాక కొత్త సమస్యలు పుట్టుకొస్తాయి. సమాజ పద్ధతిని పునర్నిర్మించినంతమాత్రంచేత పరిష్కారం కాని కొన్నిరకాల వైయక్తిక సమస్యలు అట్లాగే మిగిలి వుంటూ వుంటాయి.

3—సమాజ విప్లవమంటూ వస్తే, అది శాంతియుతంగా వచ్చినా, అశాంతియుతంగా వచ్చినా, కార్మిక వర్గం మీద ఆధారపడే అది వస్తుందనడానికి ఎక్కడా ఆస్కారం లేదు. కొన్నికొన్ని దేశాలలో మార్క్సిస్ట్ చెప్పిన పద్ధతి ప్రకారం కార్మికవర్గం అంటూ ఏర్పడని దేశాలలో కూడా ఈ సామాజిక విప్లవం ప్రారంభం కావచ్చు.

సోవియట్‌రష్యా, మావోగారి చైనా, మరిన్నీ ప్రపంచంలోని ప్రతి కమ్యూనిస్టు దేశం చరిత్రా, ఆ చరిత్ర యొక్క అనుభవ విశేషమూ వలన ఈ మూడురకాలైన దబ్బర యొక్క లక్షణం ఏమో తెలిసిపోతున్నది. నరకాన్ని గురించి, నారక బాధలను గురించి సాంప్రదాయికంగా వస్తున్న నమ్మకాలు ఎటు వంటివో, ఇప్పుడు చెలామణౌతున్న ఈ నమ్మకాలు గూడ అటువంటివే. ఈ పద్ధతిలో మార్క్సిజం కొన్ని రకముల కార్మికవర్గాలవే కాక వెనకబడి వున్న దేశాల యందలి మేధావి వర్గాలకు గూడా ఒక సిద్ధాంత ప్రపంచంగా సిద్ధమవుతున్నది. ఈ అన్నివర్గాల వారున్నూ సమాజంలో త్వరితగతిని మార్పులు రావడంవల్ల అందరికీ కావలసిన సంపద ఆవిర్భావం చెందుతుందనే విశ్వాసాన్నే కాక, తమ యొక్క శక్తులకు, తమ యొక్క వనితనాలకు సాధనాలయిన అవకాశాలు లభించగలవన్న ఆశను గూడ చూస్తూ వున్నారు.

ఈ రకమైన మార్క్సిస్టు సిద్ధాంత ప్రపంచం వల్ల దారిద్ర్యము యుద్ధము శాంతి ప్రయోజన కరమయిన వృత్తులు మొదలయిన అన్ని సమస్యలకు సమగ్రమైన పరిష్కారాలు లభిస్తాయనే వాంఛ ఒకటి ప్రబలుతూ వున్నందువల్ల ఈ రకమైన మార్క్సిజము ఇటీవల తీవ్రమయిన విమర్శలకు గురి అవుతూ వస్తున్నది. ఈ విమర్శలు చేస్తున్న వారిలో మార్క్సిస్టులు వున్నారు. స్వేచ్ఛావ్యాపార సిద్ధాంత ప్రపంచానికి చెందిన, మార్క్సిస్టులు కాని సమాజ సంస్కరణవాదులు వున్నారు. ఈ సమగ్ర పరిష్కారాల పద్ధతిని తిరస్కరించడంలో కొందరు "సిద్ధాంతప్రపంచ ప్రధ్వంసం" (ఇది అస్పష్టమూ దురదృష్టకరమూ అయిన పదబంధం.) అనే మాటను చూడాలని అంటున్నారు. ఇందుమూలంగా ఆయా సమస్యలను పరిష్కారం చేయడానికి అనుసరించబడుతూ వున్న వివిక్తపు పద్ధతులు ఎంతటి విస్తారంగా వున్నదీ తెలియవస్తుంది. కొన్నిసమస్యలకు పరస్పరమైన సంబంధం వుంది. వాటిని ధైర్యంతో పరిష్కారం చేయవలసి వుంటుంది. ఆ సమస్యలు ఎప్పుడు ఎప్పుడు వస్తున్నవో అప్పుడప్పుడు వారికమైన పునర్నిర్మాణం అవసరమవుతున్నది. ఉదాహరణకు ఒక ప్రభుత్వం వున్నది. సమాజం యొక్క సంక్షేమం కోసము ఒక పరిశ్రమను ఆ ప్రభుత్వం తన అధీనం లోనికి తెచ్చుకోవలసిన అవసరం ఏర్పడింది. అటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు ఆ ప్రభుత్వం తన ఆర్థిక విధానంలో, సుంకాల విధానంలో, వస్తువుల యొక్క ఆయాత ప్రయాత పద్ధతులలో మార్పులు చేయవలసిన స్థితి ఏర్పడిపోతుంది. విద్యారంగంలో పెద్దఎత్తున సంస్కరణలను తలపెట్టి అల్పసంఖ్యాక వర్గాలకు, వెనుకబడి వున్న వర్గాలకు అధికమైన అవకాశాలను కల్పించడానికి సంకల్పించినప్పుడు గృహవసతుల నిర్మాణ విధానాలలోను, ఉద్యోగ విధానాలలోను పెద్ద మార్పులు అవసరమవుతూ వుంటాయి. కొన్నికొన్ని సమస్యలు వున్నాయంటే, వానిని, తీవ్రమైన రాజకీయ కార్యాచరణం వల్లనే తీర్చుకోవలసి వుంటుంది. అల్జీరియాకు సమగ్ర స్వాతంత్ర్య సాధనం యిటు వంటిది. "సిద్ధాంతప్రపంచ ప్రధ్వంసం" సాహిత్యంలో కృషి చేసిన రేమాండ్ ఆరాన్, ఆర్థర్ కోస్లర్, సేమూర్ లిప్సెట్, డానియల్ బెల్ మొదలయినవారు ఉదారమైన భావసంపత్తి కల మేధావులు. సోషలిజం అంటే సానుభూతి కలవారు. తీవ్రమైన సమాజ సంబంధమైన సమస్యలు వచ్చినప్పుడు వీరెవ్వరూ నిర్వ్యాపారత్వాన్ని బోధించడం లేదు. సమాజసంబంధమైన విమర్శను, లేక సమీక్షను అర్థవంతం చేస్తున్నారు; బాధ్యతాయుతం చేస్తున్నారు.

సిద్ధాంతప్రపంచంపై మేధావివర్గం తిరుగుబాటును నిరోధించే అదృష్టం ఒక అమెరికన్ తత్త్వాచార్యునికి లభించింది.[18] ఇచ్చట ఈ తత్త్వాచార్యుడు అవలంబించిన వాదవ్యూహం అద్భుతంగా వుంది. 1 ఈయన మార్క్స్ చేసిన సిద్ధాంతప్రపంచ సమీక్షను పెద్ద విషయంగా అంగీకరిస్తాడు. 2. ద్ధాంత పద్ధతిలో ఆలోచన చేయడం తగదని చెప్పే వర్తమాన సిద్ధాంతాలను పూర్వపక్షంచేస్తాడు. ఇట్లా సిద్ధాంతం పనికి రాదనడంవల్ల ప్రతిపత్తి వి సమర్థించినట్లవుతుందని ఈయన వాదం. వివ సిద్ధాంత పద్ధతి విచారధారను వ్యాఖ్యానిస్తూ ర్థిస్తూ అందువలన మానవుని యొక్క అభివృద్ధిని ఆకాంక్షించడం అనివార్యమవుతున్నదని తెలుస్తుం మార్క్స్ కూడ సిద్ధాంత పద్ధతి విచారధారను తిరస్కరించి వున్నాడు. మనుష్యుని యొక్క అభివృద్ధి కోసం జరిగే ప్రయత్నాలకు ఇది విరోధి విషయమని చెప్పడానికి సాక్ష్యం సమకూరుతున్నది. ఇచ్చట ప్రొఫెసర్ ఐకెన్ మార్క్స్‌ను సమర్థించడము పెద్దగా పెట్టుకున్నారని అనలేము. సాంప్రదాయికమైన మార్క్సిస్టు సిద్ధాంతప్రపంచాన్ని వర్తమాన విమర్శకులు తెగడడాన్ని తెగడుతూ ఆయన ఈ వ్రాతలు వ్రాశారు. సిద్ధాంతం తగదంటూ, ఆ సిద్ధాంత ప్రపంచ ప్రధ్వంసాన్ని వాంఛిస్తూ, వ్రాతలు వ్రాసిన వారంతా మైకేల్ ఓక్‌షాట్ పద్ధతి ఆలోచనలకు తమను అర్పించుకున్న వారైపోయారని ఇచ్చట వీరియందు సిద్ధాంత ప్రపంచ ప్రధ్వంసం లేదని ప్రొఫెసర్ ఐకెన్ వాదించారు. మైకేల్ ఓక్‌షాట్ సిద్ధాంత ప్రధ్వంస వాదులలో మేరుపర్వతంలాంటివాడు. ఆయన పరమ మితవాది. హేతువాదాన్ని అది ఎన్ని రూపాలతో వున్నా పనికిరాదని ఖండిస్తూ వచ్చాడు. అయితే, ఇచట ఐకెన్ వాద పద్ధతి గురించి పెద్దగా చెప్పుకోవలసిన అవసరం కనిపించదు. ఒక వ్యాధి వుంది. దానికి సర్వరోగ నివారిణి అయిన మందు వున్నదని ఒకరు అన్నారు. అట్టిది వుండదని ఇంకొకరన్నారు. ఇట్లా అనడం వలన, ఏ వ్యాధికీ ఔషధం లేదని ప్రథ ఏర్పడడానికి వీలువుంది. ఐకెన్‌గారి వాదం ఇదే ధోరణిలో వుంటుంది. సర్వసమస్యలకు సర్వ సమస్యాపరిష్కారానికి అయిన పద్ధతి ఉన్నదనడాన్ని తిరస్కరించినపుడు అసలు ఏ సమస్యకూ పరిష్కారం లేదని అర్థం సిద్ధం అవుతుందని ఐకెన్ వాదం సారాంశం. సిద్ధాంత ప్రపంచాన్ని విమర్శిస్తున్న వారు చెప్పే విషయం ఏమంటే సర్వమైన సమాజ సమస్యలకు ఏకైక పరిష్కారం అంటూ వుండదు అని. అయితే మానవుని యొక్క సర్వమైన బాధలను శాశ్వతంగా నివారించేందుకు పరిష్కారమార్గ సమస్తం అంటూ వుండేందుకు వీలు లేదని ఈ విమర్శకులు అంటున్న దానికి ఐకెన్ అభ్యంతరం చెబుతారు. వీరు వృథా సిద్ధాంత అయిపోయారని తాత్త్విక విద్వ్యాపారులని ఐకెన్ వారిని మందలిస్తారు. ఐకెన్ ఇట్లా అన్నారు: "నేను సందర్భోచిత క్రియావాదిని అయినప్పుడు, ఒకరికి ఏ రకమయిన ప్రక్రియయందు విశ్వాసం లేక మానవలోకం బాధలను తొలగించేందుకు ఏ రకమైన పథకమూ లేక, ఆ మానవలోకం సర్వబాధలను శాశ్వతిక్రూరమైన భాగధేయాన్ని అన్వేషిస్తున్నారని చెప్పడం ఎట్లా పడుతుందో నాకు దృగ్గోచరం కాకుండా వుంది."

ప్రొఫెసర్ ఐకెన్ దేనిని దర్శించలేకపోయారో, దానిని జాన్ డ్యూయీ చాలా స్పష్టంగా దర్శించారు. జాన్ డ్యూయీ సందర్భోచిత క్రియావాద(pragmatism) ప్రతిపాదకులలో ఒకరు. సిద్ధాంతప్రపంచ ప్రధ్వంసాన్ని గురించి ఇప్పుడు జరుగుతున్న చర్చలకు ఎంతో కాలం ముందుగానే సనాతన మార్క్సిజంను ఆయన ఖండించి వున్నారు. ఆ మార్క్సిజంలో ఏకైక పరిష్కార పద్ధతులను గూర్చిన అన్వేషణను ఆయన విమర్శించారు. లక్ష్యాలకు, సాధనాలకు మధ్య వుండవలసిన నైరంతర్యాన్ని తిరస్కరించడం కూడా ఆయన తిరస్కరించాడు. వ్యావహారిక లక్ష్యానికి పరమార్థ లక్ష్యాలకు మధ్య సనాతన మార్క్సిజంలో తేడా ఎంచబడింది. ఇట్లా చేయడం మూలంగా సమాజ సంబంధమైన ఆదర్శం వెనుక వున్న సారభూతమైన సమస్త సూత్రమున్నూ అచలమైన పదార్థేతర లక్ష్యం కింద, గమ్యం కింద పరివర్తనం చెందడం జరుగుతున్నది. జాన్ డ్యూయీ ఈ సర్వ విషయాలను ఎప్పుడో చెప్పివున్నారు.[19]

18. Henry Aiken, ("The Revolution Against Ideology" commentory, April 1964.

19. Jan Dewey-Liberalism and Socia! Action (New York-1935). మరియు Freedom and Culture (New York 1939).

ప్రొఫెసర్ ఐకెన్ వంటి తత్వికులు చాల మంది వున్నారు. వారికి అవ్వ కావాలి, బువ్వా కావాలి. మార్క్సిజం పనికిరాదు. సోషలిజం అంటే గిట్టదు. అయినా, దానియందు కొత్త ఆలోచనలను వూది మానవుని అభ్యుదయాన్ని కోరి, పోరాటం సాగించే సర్వవిధాభ్యుదయ వాదులను మార్క్సిస్టు సిద్ధాంతులనుగా మార్చే పద్ధతిలో వీరి వాదం నడుస్తూ వుంటుంది. స్వాతంత్ర్యం పట్ల, శాంతి పట్ల, సమాజంలో సమానత్వం పట్ల నైతికమైన కామన వుండాలి అంటే "ఏదో సిద్ధాంతం" పెట్టుకోక పోతే తప్పదని ఈ రకం సిద్ధాంతులు భావిస్తుంటారు. శిశువుల యందు, పశువుల యందు క్రూరతను నివారించడానికి కూడా సిద్ధాంత కామన వుండాలంటారు. ఇది ప్రజాసంఘటన పద్ధతి వంటిది. పట్టి ప్రచ్ఛన్న మార్క్సిజం. ఈ ప్రచ్ఛన్న మార్క్సిజంలో "అతివాదులకు" శత్రువులు అంటూ వుండడానికి వీలులేదు. వుండరు. ఇది ఒక భ్రమ. ఈ ఆలోచన భ్రమ మూలకమైంది. హెర్బర్ట్ హోవరు మొదలు విట్టేకర్ ఛాంబర్స్ వరకు వున్న ప్రతీప వాదులు వారి పద్ధతిలో ఇటువంటి భ్రమనే ఒకదానిని పెంచుకొని అవలంబించి రూజ్వెల్ట్ గారి New deal ను,. శ్రేయోరాజ్యాన్ని, ఉ పద్ధతుల యందున్న వివిక్త పరిష్కార పద్ధతిని కమ్యూనిజానికి వివిక్త ధోరణి గల విజయంగా భావిస్తూ వచ్చారు. వారికీ వీరికీ తేడా లేదు.



## గుండ్లపాలెం శాసన ద్విపద: బాలభాగవతములోనిదా?

శ్రీ అప్పారావుగారు మరల 44—2 సంచికలో మరియొక యూహను ప్రకటించి, నా వాదమును త్రోసిరాజనుట చాలదు.

అసలీద్విపద గ్రంథాధారమైనదా? పుక్కిటి పురాణములోనిదా? అని పరిశీలించవలసిన అవసర మున్నది.

ఆ ద్విపద మూల మిట్లున్నది:

'గోపక్ష. పౌత్రు(లు) — కులవంశకరులు
బృందావనమ్మున పృథివి బెంపొంద
నంద వ్రజంబున నవి నొప్పుచుండ
ఆవుల మేపుత (తు) నలరి గోపకులు
రైవతాచలమున రంజిల్లుచున్న
యాదవులకు దైవమె (మ) ంతయు నొప్ప
అమృత భోగేశ్వరుం డందు వెలిసు(ల్చు)న్న
(గద్య)
ప్రతిష్మలు నేసిరి— ప్రతిభవిహార'

దోనేరు కోనేరు 'కవిసార్వభౌముండీ హరిహిత బాలభాగవతహరిపదద్విపద ప్రబంధమున్' బల్కె నునుట; శైలి లక్షణమా? అన్వయ సౌలభ్యమా? వ్యాకరణ సమ్మతమా? గణదోష నిదర్శనమా?

ఇది మంజరీద్విపద. ఏడు పాదములతో ఉన్న దానిని నాలుగు పాదములుగా ఉదాహరించుట పొర పాటు. యతి తప్పినదని, గణము పోయినదని తలచి కాబోలు 5—6 పాదములు వదిలి వేయబడినవి.

ద్విపదలో పాదాగ్రప్రాస చెల్లినను, చెల్లక పోయినను తప్పులేదు. లేఖక దోషములు సరిదిద్దుట దోషము కాదు. (వెలిసి+ఉన్న—వెలిసున్న సంధి?)

దీనిలోని 'ఆవుల మేపుతు నలరి, అందు వెల్సున్న' అను క్రియలు కీ. శ. 1547 ప్రాంతం బాలభాగవత ద్విపదలోని వగునో? కాదో? సత్యాన్వేష కులు వ్రాతప్రతులను పరిశీలించి తేల్చవలసి యున్న దని నా విన్నపము.

గుంటూరు మండలములోని అమీనాబాదు పుల్లరిబోడ కొండమీది 'శ్రీనాథ కృతి' శాసనము నందలి 14—1—1416 తేదీ పద్యము, నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా గుండ్లపాలెం ద్విపద శాసనము, పూర్వమునందలి 23—10—1438 తేదీకి పోతన భాగవత పద్యములు క్రీ. శ. 15 శతాబ్ది మధ్యకాలములో సమకాలిక పద్యములై యుండగా కాదని, క్రీ. శ. 1547 ప్రాంతములోని దోనేరు కోనేరు కవిసార్వభౌముని బాలభాగవత ద్విపద, పోతన పద్య భాగవతము కొంచె మెచ్చుతక్కువగా సమకాలిక ములు కాబోలనుట చిత్రమేకద!

—దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి.

## "జిజ్ఞాస"కు సమాధానం సరికాదు

ఆర్యా,

ఫిబ్రవరి నెల భారతి యందు ఎం. భాస్కర రావుగారు "జిజ్ఞాస" అనుపేర సందేహమును దెల్పి సమాధానమును కోరిరి. ఆపై మార్చినెల భారతిలో అవధానుల నారాయణ సన్యాసిరావు గారు ఉచథ్యుని కథ దెల్పిరి. అతడు సోముని యల్లుడని చెప్పిరేకాని అతని భార్య "భద్ర" అనునది తెల్పలేదు. ఈ ఉచ థ్యుని కథ దేవీభాగవతము మరియు భారతము అను శాసనిక పర్వములో వున్నది. అతడు వరుణుని పై నలిగి సముద్రమును ఎండించెను. కాని త్రాగుటకు పనికి రాకపోవునని శపించలేదు. ఇది ప్రసిద్ధమైనదే కాని క్రొత్తకాదు. ఎం. భాస్కరరావుగారి ప్రశ్న "అపేయముల్గాగ" (త్రాగుటకు గాకుండ) శపిం"చె. ఆ బ్రాహ్మణుని కథ దెల్పుడని కోరిరి. దానికి సమా ధానము ఉచథ్యుని కథ కాదు.

పూర్వము బడబాముఖుఁడనెడి ఋషి యుండెను. అతడు మేరుపర్వత మందు గొప్ప తపస్సు చేయు చుండెను. అతని శరీర ముష్ణమాయెను. శాంతికై సముద్రమును బిలిచెను. సముద్రము రాదయ్యె. దానికతడు కుపితుడై జలములను స్తంభింపజేసెను.

దానికి చెమ్మట గారుటకు సాటిగా నుప్పుదనము గలిగించెను. అంతేగాక దానితో "నీవు ద్రావదగనికుండుదువుగాక" "నీ జలములను బడబాముఖమనెడి యగ్ని చేత ద్రావంబడి దానికి మధురమై యుండి, నీ గర్వము నడంచుగాక" అని శపించెను. అప్పటినుండి సముద్ర జలము లుప్పై త్రాగుటకు నిరుపయోగకరమై పోయినవి. (ఈ కథ ఆంధ్రభారతములో లేదు. సంస్కృత భారతమ్, శాంతి పర్వములో వున్నది.)

—కారుపర్తి రాజారాం.

## ప్రాచీన సాహిత్యము-విమర్శ

ఆర్యా,

మార్చినెల 'భారతి'లో మీరు ప్రచురించిన శ్రీ వాగళ్ళ గురుప్రసాదరావుగారి 'ప్రాచీనసాహిత్యము—విమర్శ' అను వ్యాసమును చదివి ఇది మీకు వ్రాస్తున్నాను. విమర్శను గురించి, విమర్శకునకు ఉండవలసిన యోగ్యతలను గురించి, విమర్శకునకు అవసరమయిన దృక్పథాన్ని గురించి ఇంత చక్కటి వ్యాసం ఈవరకే రావలసింది. ఇప్పటికైనా వచ్చినందుకు రచయితనూ, ప్రచురించిన మిమ్ములనూ అభినందించకుండా ఉండలేను. శ్రీగురుప్రసాదరావుగారు చెప్పిన లక్షణాలు ఒక్క ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించే వారిలోనే గాక విమర్శకు లందరిలోను తప్పక ఉండవలసినవి. 'ప్రాచీన సాహిత్యము—విమర్శ' అనే కంటె 'సాహిత్య విమర్శ' అంటే ఇంకా బాగుండేది. వ్యాసకర్త బహుశా ఈ నాడు ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించటంలో మనం చూపుతున్న 'అవిమర్శక' దృక్పథాన్ని ప్రధానంగా మనసులో ఉంచుకొని ఉంటారు. కాని వారి వ్యాసంలో 'నవ్యకవిత్వం'పట్ల కొందరు పండితకవులు చూపుతున్న నిరాదరంగూడా విమర్శించ బడింది. సాహిత్యాన్ని గురించి చక్కగా ఆలోచించినవారు, ప్రాచ్యులైనా, పాశ్చాత్యులైనా, విమర్శను గురించి ఈ మాటలే అంటారు. ఎలియట్ అంటాడు: ఈ నాటిదైనా, ఇరవై అయిదువేల ఏళ్ళనాటిదైనా సాహిత్యాన్ని ఒకే దృష్టితో చూడగలిగినవాడు విమర్శకుడు. కాలగమనమాత్రంచేత మహత్వాన్ని సంతరించుకున్నదిగాగాక కాలాతీతమైన మహత్వం కలదిగా సాహిత్యాన్ని సంభావించాలి.

— రాధాకృష్ణమూర్తి.

## దేశభక్తుని జీవితదృశ్య సంపుటి

ఆర్యా,

'దేశభక్తుని జీవితదృశ్య సంపుటి' అనే పేరుతో రమణారెడ్డిగారు భారతిలో చక్కని వ్యాసాన్ని వ్రాశారు. వెంకటప్పయ్యగారి విశిష్టమైన సేవను రచయిత కొద్ది పేజీలలో విపులీకరించారు.

ఫిబ్రవరి సంచికలో వెలువడిన వ్యాస భాగంలో చిట్టచివర ఒక తప్పు దొర్లినట్లు కనిపిస్తుంది. మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ నెహ్రూకు సాయంపట్టి వెంకటప్పయ్యగారిని మేడమీదనుంచి క్రిందకు తీసుకువచ్చినట్లు వ్రాశారు. ఇది సరిగా తోచదు. దేశభక్తుని అస్తమయం 1949, ఆగస్టు 15 న. శ్రీ ప్రకాశ మద్రాసు గవర్నరుగా నియమితులైనది 1952 లో, సార్వత్రిక ఎన్నికలు జరిగిన తర్వాత. కనుక వెంకటప్పయ్యగారు నెహ్రూను రాజభవన్‌లో కలిసికొన్నప్పుడు గవర్నరు భావనగరు మహారాజా అయివుండవచ్చునుకాని శ్రీ ప్రకాశ అయేందుకు వీలులేదు.

—గుడ్లవల్లేటి వెంకటేశ్వరరావు

# గ్రంథ విమర్శలు

## రంగపతి

(నవల. రచన : దుర్గానంద్. ప్రచురణ : కాలచక్రం ప్రచురణలు. నత్తారామేశ్వరం, (వయా) పెనుమంట్ర — పశ్చిమగోదావరి జిల్లా. పుటలు : 370. వెల: రూ 7—50.)

ఊరు మేదినీపురం. లోగిలి పోతరాజుదొడ్డి. పోతరాజా వంశస్థుడు రంగపతి ఆయుర్వేద వైద్యుడు. అతని అన్న మంగపతి పండితుడు. ఈ కుటుంబంలోని వ్యక్తుల్ని — పెద్దవారినీ పిన్నవారినీ— సుదీర్ఘంగా వర్ణిస్తూ, వారిలోని వైవిధ్యాన్ని వ్యక్తంచేస్తూ, తద్వారా తెలుగుదేశంలో,* తెలుగువారి నాగరకతలో, సంస్కారంలో, ఈ శతాబ్దిలో వచ్చిన మార్పుని అభివ్యక్తంచేసే ప్రయత్నమే నవల ఉద్దేశం. నవలలో కథ అంటూ పెద్దగా ఏమీ లేదు.

రంగపతి యిద్దరి అల్లుళ్లలో చిన్న అల్లుడు అంభోనిధి పండితుడు, కవి. తిరుపతి వెంకట కవుల ప్రభావంతో ప్రస్ఫురిల్లిన అవధానాల, పద్యాల సాహిత్య సంరంభానికి ప్రతీక. నవలలో ఇతని ప్రతిభ తెరచాటు దీపం వతుగానే ఉంటుంది. కారణం, రచయిత ఉద్దేశంలో, "అందమైన స్త్రీలో సిగ్గు ఉన్నట్లు ప్రతిభకకూడా బిడియం అవసరమట! పూర్తి వికాసం పొందిన తర్వాత బిడియం సాహసంగా మారుతుంది"ట! అంభోనిధిలో బిడియం సాహసంగా చివరిదాకా రూపొందనేలేదు! ఇల్లరికపు టల్లుడుగా వచ్చినవాడు వచ్చినట్లు చివరకు మేదినీపురంలోనే స్థిరపడిపోవటంలో 'సాహసం' బయట పడలేదు!

రంగపతి అన్నగారైన మంగపతి కొడుకు భగీరథుడు. లండన్ వెళ్లి బి. ఎస్‌సి. చదివి వచ్చినవాడు; కొవార్తెకు 'జూలీ' అని పేరు పెట్టడం, కుక్కని పెంచడం, ఇంగ్లీషులో మాట్లాడ్డం, వగైరా విషయాల్లో పాశ్చాత్య నాగరకతా ప్రభావానికి లొనైన భారతీయునికి ప్రతినిధి. ఒకసారి అంభోనిధీ, భగీరథుడూ తారసిల్లి సాహిత్యాన్నిగూర్చి దాని భిన్న (ప్రాచ్య పాశ్చాత్య) లక్ష్యాల్ని గూర్చి మాట్లాడుకుంటారు. [పుటలు 107—110]. తర్వాత అంభోనిధి ఏర్పాటు చేసిన నీలకంఠశాస్త్రి అష్టావధానానికి భగీరథుడు హాజరవుతాడు. అష్టావధానంలో భగీరథుడు కొంత అసహనంతో, కాని న్యాయంగానే, గ్రామమునసబుని మందలించటం కారణంగా, కొంప లంటుకుపోతాయి. గ్రామంలో వైషమ్యాలు చెలరేగుతాయి. భగీరథుడు కొందరు రౌడీలను అండగా పెట్టుకుంటాడు. మునసబు వర్గంవారు రంగపతి కుటుంబం వారిమీద—పోతరాజుదొడ్డిమీద — కక్ష గట్టుతారు. రచయిత ఉద్దేశం—పాశ్చాత్య నాగరికత, సంస్కారం, తత్సంబంధమైన భావాలూ, తద్వ్యావహారికనీతి ప్రవేశించడంద్వారా, అంతవరకూ ఏకంగా ఉండిన పాలవంటి గ్రామీణ సౌహార్ద్రభావం కాస్తా విరిగి పోయిందని ఆరోపించడంగా తోస్తుంది. ఇది సమర్థనీయమైన, చారిత్రకంగా సత్యమైన, ఆరోపణ కాదు! కథలోకూడా దోషం యిరువైపులా ఉన్నట్లు చిత్రింపబడింది. అందుచేత భగీరథుని పాత్ర నవలలో అభివ్యక్తం చేయవలసిన అంశం ఏదైనా ఉంటే అదీ ప్రస్ఫుటం కాలేకపోయింది.

పోతే మురారి— రంగపతి పెద్దల్లుడు —రచయితకు అభిమాన పాత్రగా కనిపిస్తాడు. అతనిద్వారా ఒక సమన్వయాన్ని లేక ఒక చరమసత్యాన్ని సూచించాలని రచయిత ఉద్దేశం కావచ్చు. మురారి వ్యక్తిత్వం "పుస్తకాలనే స్తంభాలమీదా, ఆచారాలనే గోడలమీదా కట్టబడిన గుడివంటిది కాదు. ఎక్కడి కక్కడే మండి, ఎక్కడి కక్కడే ఆరిపోయే అగ్ని లాంటిది. ప్రపంచంలో చాలమంది మనుష్యులు ప్రతి విషయాన్ని వెర్రిగా తెలుసుకోవాలనీ ఆరాటపడుతుంటారు. తెలుసుకోవడానికి పూర్వజ్ఞానం ఆధారమై ఉంటుంది. మురారికి అలాంటి ఆధారాలు లేవు. ఎక్కడ ఉంటే అక్కడే అతనుంటాడు.* ఎక్కడా లేనిచోట ఎక్కడా లేకుండా పోతాడు: లేనిచోటకూడా

అతణ్ణి తెచ్చి కలుపలేము. అందువల్ల అతని వ్యక్తిత్వం తుంపులు తుంపులుగా ఉంటుంది.* అతని ప్రవాహమే అతని జీవితం. ఆ ప్రవాహ దిశలను అందుకోలేనివాళ్ళు సుభద్రమ్మవలె (అతనిభార్య) సుళ్ళు తిరిగి పోతుంటారు. నరములేని మాంసం శరీర మనిపించుకుంటుందా? మురారి మాంసంలో నరాలు, ఊహలో ఆధారాలు ఉన్నాయో లేవో తెలియదుకాని అతడు నిర్గుణుడు, నిరాకారుడు మాత్రం కాదు. అతనికి ఆకారముంది, గుణముంది. ఆ గుణాన్ని కనిపెట్టేశక్తి సుభద్రమ్మలో లేదు: అందుకని సుభద్రమ్మను అనభిజ్ఞ అనలేము. మురారిని మాత్రం చపలుడు అనవచ్చు... అతడొక్కడే ఒక్కడు. అతనికి లోకంలో పౌరసత్వపు హక్కులేదు. అతడు చపలుడు. అతని చిత్తం చపలమైంది. అతణ్ణి కొందరు తిక్క మురారి అనికూడా పిలుస్తూ ఉంటారు.'' (42—43 పుటలు). ఈ నవలలో పాత్రలను వర్ణించిన విధానానికి ఈ ఉటంకింపు ఒక ఉదాహరణ. ఇందులో స్పష్టతకంటె అస్పష్టత ఎక్కువ. ముఖ్యంగా *—* గుర్తుపెట్టిన వాక్యాలు మంచి రచన అనిపించుకోవు. పైగా ఈ రకం వర్ణన పద్ధతి వ్యాసానికి పనికివస్తుందికాని నవలకు కాదు. నవలలో పాత్రలు వారి ఆలోచనలద్వారా మాటల ద్వారా, చేతలద్వారా, స్వయంగా రూపొందాలి. ఆసంగతి అలా ఉంచితే, మురారి పాత్రద్వారా రచయిత వ్యక్తం చెయ్యదలచుకున్న అంశం ఏమిటి? మురారి అసలైన సిసలైన మానవుడు—ఏ ఆచారాలూ, అడ్డుగోడలూ, సూత్రాలూ, చుట్టుకొలతలూ లేని కేవలం మానవుడు! సంగీతం, నాట్యం, వేట అతని అభిమాన విషయాలు. అంతేకాదు, మురారి ఋతువుల ననుసరించి వేషధారణ చేస్తాడట. "అతని ఋతుధర్మముల మార్పులను గమనించని మనుష్యులు అతణ్ణొక పైలాపచ్చీసుగాభావించి లెక్కచెయ్యరు. అతడు విలాసపురుషుడు. కాని అతనిలో ప్రకృతిసహజధర్మాలు ఉన్నై." ఈ ప్రకృతిమానవుడు (natural man) భాధ్యత, సంయమనంలేని స్వేచ్ఛాప్రవృత్తికి ప్రతీక.

కవిత్వంలో దేశి, మార్గ విభేదాలను దృష్టిలో పెట్టుకుని బహుశా రచయిత మురారి, అం విధులను రంగపతికి అల్లుళ్ళుగా నిర్దేశించాడేమో! మురారి దేశికవిత్వం లాంటివాడు. అతను 'జనత'లో కలిసిమెలిసి నట్లుగా మరెవ్వరూ కలియలేరు. మురారి అత్తమామలను లెక్కచెయ్యడు. స్వచ్ఛంద ప్రవృత్తి, పిల్లల భవిష్యత్తు విషయమై ఆలోచించడు. కొడుకు అభిరుచి గుర్తించి డోలు వాయించడం నేర్చుకునేందుకు మంగలి ఇంటికి పంపిస్తాడు. ఈ విషయమై మురారీ సుభద్రమ్మా వివాదపడతారు. మురారి కొడుకునూ కూతుర్నీ వెంట బెట్టుకు దేశంమీదికి వెళ్ళిపోతాడు. కూతుర్ని కులస్థుడైన ఒక బస్సుడ్రైవరుకి కట్టబెట్టి చక్కా వస్తాడు.(ఇక్కడ వరుడు కులం మదే కావటం ఎందుకో?) కట్నం కానుకలూ, ఏ హడావుడీ లేకుండా ఎవరికీ చెప్పకుండా కూతురికి పెళ్ళిచేసి వచ్చాడని అందరూ విడ్డూరపడతారు. ఇది రచయిత మురారిద్వారా సూచించదలచుకున్న ఒక రకం సాంఘిక విప్లవం కాబోలు---కట్నం వగైరా వివాహ సమస్యలకు 'మానవతా' దృక్పథంనుంచీ " పరిష్కారం! గ్రామ వైషమ్యాల విషయంలో మురారి ప్రబోధం : "అబ్బాయిలూ! మనది సన్యాసుల దేశం. బుద్ధుడు మన దేశంలో పుట్టాడు. గాంధీ మనదేశంలో పుట్టాడు. ఆనందమిచ్చేది మన కావ్యం. హంసలో సందేశం పంపేది మన పురాణం....దుర్యోధనుడూ, శకునీ ఎప్పుడూ గుసగుస లాడుతూనే ఉండేవాళ్ళు: వాళ్ళు బాగుపడ్డారా? దేశాన్ని బాగుపరిచారా?!! ఈ ప్రపంచం బంధనరహితం. సృష్టిలో రహస్యమంటూ ఏమీలేదు...మీమ్మల్ని మీరెందుకు గాటుపెట్టు కుంటారు?'' మురారి భగీరథునిమీద హత్యా ప్రయత్నం జరగకుండా సమయానికి హెచ్చరిస్తాడు. భగీరథుడు రక్షింపబడ్డా, అతని కుక్క చంపబడు తుంది. రచయిత ఉద్దేశం, మానవుల మధ్య 'విశ్వాసం' చచ్చిపోయిందని! రాచకీయా లెక్కువయ్యాయని!

రంగపతి తన వైద్యవిజ్ఞానాన్ని మనుమ సంతానానికి నేర్పాలనుకుంటాడు. వాళ్ళకు దానిలో ఆసక్తిలేదు. శంభుడు కమ్యూనిస్టుపార్టీ అభిమాని. కళాధరుడు సంగీతం అభ్యసించడానికి తంజావూరు వెడతాడు. రంగపతి మంచానపడి, సంధిలో అందరికీ వీడ్కోలుచెప్పి మరణిస్తాడు.

రంగపతి గతించిన ఒకనాటి తెలుగుదనం: గ్రామీణమైన తెలుగుదనం! రంగపతికి వారసులెవరు? అంభోనిధిలో (సంస్కృత పాండిత్యము, సాంప్రదాయికమైన విద్య) నవజీవనానికి కావలసిన సాహసం క్రొత్తదనం లేవు. భగీరథునిలో (పాశ్చాత్య విద్య) సౌహార్దము, సౌమనస్యం లేవు. అతను గ్రామజీవనంలో యిముడకపోవడమే కాదు, గ్రామసౌహార్దాన్ని భగ్నంచేశాడు. మురారిలో (దేశీయత) వైరాగ్యం పాలు ఎక్కువ, అతనికి బాధ్యతా లేదు, వారసత్వం లేదు; విముక్తి, స్వేచ్ఛ కావాలి. శంభుడు (కమ్యూనిజం) వారసత్వాన్ని బొత్తిగా నిరాకరిస్తాడు. రంగపతికి—అంటే ఒకనాటి తెలుగుదనానికి—నేడు వారసులు లేరంటూ నవల ముగింపు. పోతరాజు నాటిన రాతిస్తంభంవైపు చూస్తూ ఒక పిల్లవాడు రాయి విసిరివేశాడు అన్నది చివరివాక్యం—క్రొత్త తరంవాళ్ళు తెలుగుదనాన్ని ఎలా పునర్నిర్మించే ప్రయత్నం చేస్తారని ప్రశ్నార్థకమైన ధ్వని! తెలుగుదనాన్నిగూర్చిన పై విశ్లేషణ (Analysis) అసమగ్రంగా ఉందని వేరుగా చెప్పనక్కరలేదు.

తెలుగుదనం అంటే ఏమిటి? అది అందరూ వేసుకోవలసిన ప్రశ్నే. ఆ ప్రశ్నను ఈ నవల రూపంలో వేసినందుకు రచయిత అభినందనీయుడు.

## లాడ్జింగులో ఒక రాత్రి

[నవల. రచన: కొపరాజు శేషయ్య, ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ -2, పుటలు: 196. వెల: రూ 3/-]

'లాడ్జింగు'ల పేర చలామణీ అవుతున్న వ్యభిచార గృహాలు కొన్నిపట్టణాల్లో పెద్దఎత్తున వ్యాపారసరళితో అభివృద్ధికావడానికి దోహదమౌతున్న ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను విశ్లేషణాత్మకంగా అభివర్ణించే ఈ నవల ప్రధానంగా సంఘసంస్కరణోద్దేశంతో వ్రాయబడింది. ఇందులో కథానాయకుడు మోహనరావు ద్వారా ఒక 'లాడ్జింగు' వ్యవహారం బయటపడి, పోలీసులదాకా వెళ్ళి ఆ 'లాడ్జింగు' రద్దు కావడం, అందులోని స్త్రీ పురుషులకు మరో విధమైన బ్రతుకుదెరువు ఏర్పడడం కథ. మోహనరావుని 'లాడ్జింగు'కి తీసుకు వెళ్ళిన రిక్షావాలా నాగేశ్వరరావు, చదువుకున్న యువకుడు, నిరుద్యోగి. అక్కడ మోహనరావుకి తారసిల్లిన స్త్రీలు కనకం: అతను చిన్నతనంలోనే ఎరిగున్న కరణంగారి కూతురు. తార: అతని ప్రాణ స్నేహితుడు కోరి వివాహమాడిన నవవధువు! ఈ యిద్దరి స్త్రీలనూ ఆ నరకకూపంలోనుంచీ తప్పించేందుకు మోహనరావు ప్రయత్నించి నెగ్గుతాడు. మోహనరావు డబ్బూ, పలుకుబడీ రెండూ ఉపయోగించడంవల్లే కాదు, పోలీసుశాఖలో అదృష్టవశాత్తూ మోహనరావు బంధువు సూపరింటెండెంట్‌గా ఉండటంవల్లకూడా వెంటనే కార్యసాధన వీలైంది. అప్పటికీ దోషులైన వ్యక్తులు దొరకకుండా పారిపోయారు. ఇదీ నేటి వాస్తవికమైన పరిపాలనా పరిస్థితి! 'లాడ్జింగు'ని నడిపిన వ్యక్తులకంటె 'లాడ్జింగు'కి మద్దతు కల్పించే కొందరు లాయర్లు, లాయరు గుమాస్తాలు, వ్యాపారస్తులు, ధనికులు, యింకా ఎందరో స్త్రీ పురుషులూ, సంఘంలోని ఈ రకం మురికికూపాలకు బాధ్యులు. అంటే సంఘంలో పరివర్తన రావాలి, సంస్కారం పెరగాలి. ఇక్కడ రచయిత ఉద్దేశం: స్త్రీ పురుషులందరూ సీతారాముల ఆదర్శాన్ని తు, చ తప్పకుండా అమలుపరిచే ఒకానొక స్వాప్నిక సమాజం (Utopian socity) అవతరించాలని కాదు! ఏ యుగంలోనైనా 'సెక్స్'కు సంబంధించిన స్వేచ్ఛాప్రవర్తన, నీతిసూత్రవ్యతిక్రమణ వ్యక్తుల్లో కొద్దిగానో గొప్పగానో ఉంటూ వస్తున్నదే. అది మానవ ప్రకృతికి లక్షణం. అలా కాక సంఘంలోని కొన్ని శక్తుల్ని — డబ్బు, అధికారము, పలుకుబడి వంటి శక్తుల్ని—కూడగట్టుకుని వ్యక్తుల జీవితాన్ని నాశనం చెయ్యడానికీ, కలుషితం చెయ్యడానికీ వ్యాపార సంస్థలు ఏర్పాటు చెయ్యడం మానవుని దుర్జనత్వానికి లక్షణం. ఇది సహింపరానిది. ఈ రచయిత పాశ్చాత్యదేశాలలోని క్లబ్బులు వగైరాలతో ఈ 'లాడ్జింగు'లని పోల్చి రెండింటికీగల భేదాన్ని వివరిస్తూ నవలలో యిలా వ్రాశారు: ''ఉభయులకూ ఇష్టమైతే వాళ్ళు లాడ్జింగులకు పోయినా, క్లబ్బులకు పోయినా, వారిని మనము అనవలసిన పనిలేదు. కాని అమాయిక యువతులను, స్త్రీలను బలాత్కారముగా

యిబ్బాడ్చుకుపోయి వ్యభిచారానికి వినియోగించుకుంటున్నారండీ. ఈ విషయమే తమ దృష్టికి తీసుకురావాలని నా అభిప్రాయం." రచయిత దృష్టి యిలా సహనంతో కూడుకున్నదీ, విశాలమైనదీ (Liberal), వాస్తవికమైనదీ కావటంవల్లే ఈ నవలలో మోహనరావు, తార — అందరూ మన సానుభూతిని పొందేలా వారి వారి సహజస్వభావాలతో రూపొందటం జరిగింది. కథ సుఖాంతం అయింది.

"తప్పు చేయడం మానవనైజం అన్నారు పెద్దలు. తెలిసో తెలియకో ఏ వ్యక్తి అయినా ఒక పొరపాటు చేస్తే దాన్నే ఆధారంగా తీసుకుని ఆ వ్యక్తి యొక్క నైతిక విలువలను అంచనావేయడం సరియైన పద్ధతి కాదేమో అనుకుంటాను." ఈ ప్రబోధంతో కథానాయకుడు మోహనరావు, కనకం నాగేశ్వరరావులకు వివాహం కుదిర్చి, తారను ఆమె భర్త స్వీకరించేటట్లుచేసి, వారి జీవితాల్ని పునరుద్ధరిస్తాడు. క్షమ అనేది లేకపోతే సంఘసంస్కరణం సాధ్యంకాదు. సంఘపురోగతి, మానవజీవితంలో సుఖశాంతులూ, మనుష్యుల్లో క్షమ, ఔదార్యం పెరగడంమీదే ఆధారపడతాయి. సంఘజీవనంలో నైతిక కర్కశత్వం ఆత్మపరంగాకాక, యితరుల మీద కేంద్రీకరింపబడుతూ ఉండటమే సంఘంలో ఎప్పటికప్పుడు తెట్టెలుకట్టే కశ్మలానికి మూలం. దాన్ని క్షాళనంచేసే ఉద్దేశంతో వ్రాయబడిన ఈ నవలలో మానవతాదృక్పథం ప్రధానం కావడం ఎంతో సముచితంగా ఉంది. ఈ నవలకు సాహిత్యంలో పెద్ద గణన లేకపోవచ్చు, సాంఘికంగా చక్కని ప్రయోజనం ఉన్నది.

ర్, ఎస్.

## లోకాలోకం

[వచన గేయ సంపుటి; కవి : స్ఫూర్తిశ్రీ: విపంచికా ప్రచురణలు, రామారావుపేట, కాకినాడ; 86 పేజీలు : వెల : రూపాయిన్నర.]

అభ్యుదయ కవిత్వోద్యమం శ్రీశ్రీ తో ప్రారంభమై, శ్రీశ్రీ తో పరిణతి పొంది, శ్రీశ్రీ తోనే ముగింపుకు వచ్చిందనే విమర్శకులు కొందరున్నారు. కాని శ్రీశ్రీ స్పృశించని మానవ సమస్యల కొత్త కోణాలను అవలోకించి, ప్రతిభావంతంగా కావ్యగానం చేసిన కవుల నింకా ఇంకా విమర్శక మహాశయులు గుర్తించటమే లేదు. అభ్యుదయ కవులు భావదాస్యం చేసినవారు కారు. క్షీణయుగపు కవిత్వచ్ఛాయ లింకా భావకవిత్వోద్యమపు తుదిదినాలలో దాపురించాయి. గాని అభ్యుదయ కవులకు భాషావిషయంలోనూ, భావంవిషయంలోనూ అనుకరించే దురదృష్టం పట్టలేదు. కొద్దిమంది అనుకరణ జాడ్యం ఉన్న కవులు ఏ యుగంలోనైనా ఉంటారు. ఐతే వర్గ విభేదాలను గమనించటంలోనూ, తోటి మానవుల యెడల లోనివ్యధలకు కావ్యరూపం కల్పించటంలోనూ వీరికి ఏకసూత్రత కన్పిస్తుంది. అభ్యుదయ కవులందరూ ప్రపంచాభ్యుదయపు వెల్లరేకై పల్లవించాలనుకొనేవారే. మొక్కలు సూర్యరశ్మిని గ్రహించి కిరణజన్యసంయోగక్రియతో ఆహారాన్ని తయారుచేసికొని పూలుగా, పండ్లుగా యిచ్చినట్లే అభ్యుదయ కవులకు శ్రీశ్రీ సాయపడ్డాడు. ఈ కవులు వేర్వేరు మొక్కలవలె భిన్నజాతుల ఫల, పుష్పాలనందించిన వారే.

నిరంతర లోక పరిశీలనం కవికి ఊపిరి వంటిది. 'అభ్యాసం కూసు విద్య' అని క్షేమేంద్రుని కాలంనాటి దేప్పుంది. అతడు కవులకు లోకపరిశీలనావశ్యకతా, ఔచిత్యనిర్వహణాదక్షత గురించి నొక్కి చెప్పేడు. లోకాలోకనం చేసిన 'స్ఫూర్తిశ్రీ 1948–63 సంవత్సరాలమధ్య తన ఆలోచనా పరిధికి అందిన విషయాలను, తాను లోకపరిశీలనంచేసి గ్రహించి, కవిగా వివేచన చేసుకొని, ప్రతిభావంతంగా, వ్యుత్పన్నతను జోడించి చెప్పిన వచనగేయాలివి. వచన గేయానికి గీతి మాధుర్యం విహితంకాదు గాని ఉంటే శ్రవణపేయమౌతుంది. అట్టి కవిత్వం కవితాకళ సమాహార రూపాన్ని కొంతవరకు పొందుతుంది.

గొంతెత్తి చదవటానికి అనుగుణంగా 'లోకాలోకం'లోని గేయాలన్నీ రచింపబడ్డాయి. అభ్యుదయ భావాలతో అభ్యుదయకవితారచన కనుగుణమైన వచన గేయాలతో 'స్ఫూర్తిశ్రీ' అభ్యుదయ కవులలో చోటు గడించుకొన్నారు.

'లోకాలోకం'; 'అసతోమాసద్గమయ'; 'మృత్యోర్మాఽమృతంగమయ'; 'కోదహతి'; 'ముఖే ముఖే'; 'అంతర్దర్శనం' గేయాలు విశిష్టమైన అణుశక్తి ప్రయోగాలను చూచి బెదిరిపోక, సమగ్ర వివేచనా శక్తితో—

"మారణానలం జ్వలించింది
దానవలోకం చలించింది
మానవలోకం జయించింది
మా నవలోకం జనించింది."

అని క్రాంతదర్శియై సగర్వంగా పలికారు.

"అంతరాత్మలోని ఆజ్ఞాతబలం
ఆకసాన మనం నిల్పిన దైవం
ఆత్మ శక్తి ...
అతని చేడని కాపు"

అన్ని గంభీర తాత్త్వికజ్ఞానాన్ని లౌకిక మాటలలో, ప్రసన్న మధురంగా రచించారు. అదే విధంగా శాంతి పేరిట జరిగే అక్రమాలను ఎదుర్కొంటూ—

"శాంతి కొందరు విద్వాంసుల విభ్రాంతి
సమరం సాధారణ మానవధోరణి,' అంటారు.

ఈ కవి అసమర్థుని శాంతిని వ్యతిరేకిస్తున్నారంటే యుద్ధోన్మాది అని కాదు. మానవజాతి పట్ల ప్రగాఢ విశ్వాసం ఉన్నది. అందుకే—

"మా మాటల కెదురు లేదు
మా గుండెలలో హిమాలయాలు
మా హృదయంలో హిందూ వార్నిధి
దాక్కుంటాయ్"

అని సమాజ జీవనం గురించి హెచ్చరిస్తారు. "మృత్యోర్మాఽమృతంగమయ" అనే గేయంలో—

"గత జీవిత గాథలె ప్రగతికి సోపానాలు;
చెరిగిపోని స్మృతి పథాలె
భవిష్యజ్జీవిత భవన నిర్మితికి
కదలికలేని పునాదులు"

అని చారిత్రక యథార్థ గతిని కళ్ళకు కట్టే విధంగా వర్ణించారు. 'సత్యమేవ జయతే' అనే గేయంలో

"దూషించిన అయ్యలె
భూషిస్తారు;
భూషించిన అయ్యలె
దూషిస్తారు" అని నగ్నసత్యాన్ని వెల్లడించారు. ఈ భావం శ్రీ శ్రీ గారి "ఆః" అనే గేయాన్ని తలపిస్తుంది. ఆ గేయంలో శ్రీ శ్రీ

"నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నే నెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు!
నెత్తురు కక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరె!" అని లోక నైజానికి విస్తుపోతారు. 'స్ఫూర్తి శ్రీ' గారి గేయంలో శ్రీ శ్రీ గేయంలోని స్ఫూర్తి రాలేదు కాని

"తిరస్కార పురస్కారాలు జీవిత చక్రంలో
గిర గిర తిరిగే ఆకుల వరుసలు" అనే సుందరభావాన్ని అందించారు. "కోదహతి" అనే గేయం ఏ సౌందర్యాన్ని పురస్కరించుకొని వ్రాసిందో గాని గీతంలో చిత్రకారుని ప్రతిభ గోచరిస్తుంది.

"ప్రపంచం పూసుకుంది రక్తగంధం
ప్రకృతిశక్తి ప్రళయ నాట్యభంగిమాలు చూపుతుంది
అంటుకుంది ఆకాశం" అని పాఠకుల కన్నుల ముందు విభ్రాంతిగొలిపే చిత్తరువును చిత్రిస్తారు. "భానుబింబ మంటుకుంది" అని భయావహమైన రూపాన్ని అందిస్తారు.

"ముఖే ముఖే" అనే గేయం యీ సంపుటంలో విశిష్టమైంది. మధురమైనది. వ్యంగ్యానికి

వింతపోయగాన్ని దిద్ది యీ గేయాన్ని రూపొం దించారు. కవులలో అల్పమనస్కత ఉన్న కొందరు, విమ ర్శకులై పరుల కవితలను తూలనాడి తమ కవితలను పొగడుకోవటాన్ని వ్యంగ్యంగా పాడుస్తారు స్ఫూర్తిశ్రీ.

"పరునికవిత కఠక్కాయ
నాదో! స్వాంతస్సుఖాయ!
ఇదే కదా ముఖే ముఖే!
విన్నావా సఖే సఖే!"

గేయమంతా యిదే రీతిలో హృద్యంగా సాగు తుంది. "అంతర్దర్శనం" గేయంలో కవి అంతర్ముఖుడై —

"పొరుగువాని చిరునవ్వులు
పువ్వుల మవ్వపు జల్లులు;
మాటాడిన ప్రతివాడూ
మాటులేని తేనెతేట!" అని మనిషిలోని మంచితనాన్ని, "తల్లిని మల్లెల మాటున

నాలుక చాపే నాగుల
పూత్కారోగ్రధ్వానం
వినిపించిం దీ రోజున" అని మానవ

నైజాన్ని అర్థం చేసికొనేటందుకు ప్రయత్నిస్తారు. లోకాలోకనం చేసిన కవి, లోకాన్ని కవితామయంగా భావించి, అనుభవించి పలవరించారనిపిస్తుంది.

చిలుక బొమ్మను చక్కగా గీసి 'చిలుక' అని పేరుపెట్టటం ఎబ్బెట్టుగా ఉంటుంది. అందుకనే స్ఫూర్తిశ్రీ తన చక్కని వచన గేయాలను ఆలో చనాత్మకంగా సంస్కృతంలో 'కోదహతి'; 'కృగచ్ఛామః; 'తస్మాత్ జాగ్రత' అని ఖండకావ్యాలకు పేర్లు పెట్టారు. శ్రీమతి 'కవితాసింహా' వంగ కవితకు యించక్కని అనువాదం చేశారు. 'ఒక కవి కథనం' అనే యీ గేయంలో కవితాసింహా కవిహృదయాన్ని స్ఫూర్తిశ్రీ కవిగా చక్కగా అర్థం చేసికొని అనువ దించారు.

'చరిత్ర' అనే గేయం 'దేశ చరిత్రలు' అనే గేయానికి అనుకరణ పేలవంగానే ఉన్నది. 'సందేశం' గేయంలోను గేయానికి కావలసిన మాధుర్యమే లేదు. 'గడ్డి పువ్వులు' గేయం శ్రీ మల్లవరపు విశ్వేశ్వర రావుగారి 'గడ్డి పువ్వులు' వర్ణనతో పోల్చి చూస్తే నీరసంగా ఉన్నదనాలి. 'దీపావళి' గేయం మరీ దీర్ఘంగా ఉండి అన్వయక్లిష్టంగా ఉన్నది.

వచన కవితకు ముఖ్యంగా కావలసింది చిత్త శుద్ధి. గీతి మాధుర్యం ఉన్న గేయం అలంకార శోభితంగా ఉంటుంది. ఈ సంపుటిలోని గేయాలన్నీ గానయోగ్యంగానూ, పసందైన పదగుంభనతోనూ విలసిల్లుతున్నవి. అపశబ్దాలూ, దుస్సమాసాలూ వ్యాకరణం మొగ్గ మెరుగని అజ్ఞత మచ్చుకైనా కానరావు. ముచ్చటగా తీర్చిదిద్దిన యీ గేయ సంపుటం చదివి ఆనందించదగినది.

'అహల్య', 'వియోగిని', 'మహాశ్వేత', 'సూర్య ముఖి', 'మధుపాలిక' మొదలైన కావ్యాలద్వారా 'స్ఫూర్తిశ్రీ' యీ వరకే పాఠకలోకానికి పరిచితులు. శబ్దంపై తగినంత అధికారం సంపాదిస్తూ, ప్రతిభతో వినూత్న కావ్యాల నిర్మాణాన్ని సాధించ జూస్తున్న సాధకులు వీరు. కవులు కొందరు కాలంతోపాటు పై కెదుగుతారు. కొందరి కవిత కాలం గడిచేకొద్దీ యింకిపోతుంది. అంటే వారి కవితాజ్వాల సన్నగిల్లి క్రమంగా చల్లారిపోతుంది. మంచి కవులు కొందరు గత కాలపు కీర్తితో బ్రతుకుతారు. కొందరు కవితా కన్య కటాక్ష వీక్షణాలకై తపస్సు పొంచి తపిస్తారు. కవితా వనిత చేలాంచలాల నందుకోజూస్తూ నిరంతరం పరుగులుతీసే యీ యువకవికి మంచి భవిష్యత్తు ఉంటుందని ఆశించవచ్చు. ఎంతటి మహనీయులనైనా అనుకరించటం మానుకోవాలి. భాషలోనూ, భావం లోనూ అనుకరణకు దూరం కావాలి.

'లోకాలోకం'లోని గేయాలు ఆయాకాలపు తాత్కాలిక సమస్యలను పురస్కరించుకొని వ్రాసినవే. అయినా వాటి శీర్షికలను గమనిస్తే "సత్యమేవ జయతే," "తమసోమా జ్యోతిర్గమయ" వంటివి ఎప్పటికీ గుర్తుంచుకోవలసిన శీర్షికలు, గేయాలు.

చరిత్ర, సందేశంవంటి గేయాలు పత్రికలలో ప్రచురితమైనవైనా సరే గేయ సంపుటాలలో చేర్చే ఉబలాటం వదులుకోవాలి. గేయాలను అక్కడక్కడా అధోజ్ఞాపికలూ విసుగు కలిగించని ప్రవేశిక పుస్తకానికి మరింత నిండుదనాన్ని చేకూరుస్తాయి.

హృదయంలోనుండి వెలిగించిన కవితాదీపాన్ని కాంతి తగ్గకుండా, తైలం తరిగిపోకుండ కలకాలం కాంతికిరణాలను 'స్ఫూర్తి'తో స్ఫూర్తిశ్రీ ప్రసరింపజేయగలరని ఆశించవచ్చు.

## అమృత బిందువులు

[రచయిత: శ్రీ బచ్చు[illegible]కటేశ్వరగుప్త; అడ్వకేట్, సదాశివపేట – మెదకుజిల్లా ఆం-ప్ర; ప్రకాశకులు: మెదకు మండల రచయితల సంఘం: 135 పేజీలు; వెల—మూడున్నర రూపాయలు.]

అమృత-బిందువులని యీ కావ్యానికి పేరు పెట్టడం కేవలం అతిశయోక్తి. ఈ కావ్యంలో అమృత బిందువులను—కాదు కవితా మకరందంకోసం అన్వేషించడం ఎడారిలో నీటికై గాలించటం వంటిదే. సాహిత్య, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక రంగాలను గుఱించి వ్రాసిన పద్యాలను అమృత బిందువులనటం దుస్సాహసం.

క్షీరసాగర మథనంతర్వాత మోహినీరూపం దాల్చిన భగవంతుడు లోకకంటకులనేపేరుతో దానవులకు అమృతము పంచకుండ వంచించిన చిత్రం ఈ పుస్తకం ముఖచిత్రం. సహృదయత లోపించిందని కావ్యకర్త అనుకోవచ్చుగానీ కావ్యమంతటిలోనూ ఛందస్సుతో కూర్చిన పద్యాలు తప్ప కవితా వాసనలే లేవు. గ్రంథమంతటిలోనూ కవిత్వం వొలికి పోకుండ జాగ్రత్త పడ్డారు. కవిత్వం వ్రాయకపోవటం నేరం కాదు; పాపంకాదు; తెలిసిన ప్రతి విషయాన్ని ఛందస్సులో చెప్పాలనుకోవటం చిత్రమైన మానసిక ప్రవృత్తి. పూర్వం అచ్చుయంత్రాలు లేని రోజుల్లో శాస్త్రాలన్నీ ఛందస్సులోనే వ్రాసేవారు. ఆ అగత్యం యీ నాడు లేదు. పై పెచ్చు విషయ వివరణ కావలసిన శాస్త్రాలను ఛందస్సులో వ్రాయటం ఆటంకం. ఛందస్సు అప్పుడే సర్వ పరిష్వంగాలవుతాయి.

ఈ కవికి వివిధ విషయాలపట్ల జ్ఞానం అపరిమితంగా వున్నది. కూలంకషంగా తెలిసికొనే ఓర్పు, దాన్ని విడమర్చి చెప్పగల నేర్పు వున్నాయి. ఆయా విషయాలను గుఱించి సమగ్రమైన అవగాహన ఉన్నప్పటికి ఛందస్సులో వాటిని వ్రాసి కవిత అనిపించుకోవాలని ఉబలాటపడటం చిత్రం. ప్రముఖ విమర్శకులూ, పండితులూ శ్రీ దివాకర్ల వేంకటావధాని యీ పుస్తకానికి ప్రశంసలు పల్కటం దిగ్భ్రాంతిని కలిగించే విషయం. శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు, మాడపాటి హనుమంతరావుగారు వీరితో మిత్రత్వాన్ని పురస్కరించుకొని యీ గ్రంథకర్తను మిక్కిలిగా అభినందించారు. కావ్యాన్ని అర్థంచేసికొని అనుభవించేటందుకు సహృదయత ఉంటే చాలు. కాని కావ్యాన్నిగూర్చి అభిప్రాయమిచ్చేటప్పుడు కావ్యాన్ని గూర్చి సమగ్ర పరిశీలనం చెయ్యాలిగాని మిత్రత్వాన్ని పురస్కరించుకొని అభినందించకూడదు. ఆ అభినంద

నలకు పాఠకులు భ్రమపడే అవకాశం ఉన్నది.

సాహితీ పీఠికలలో 'గ్రహపతి పునర్జన్మ,' 'జడివాన' 'బింబిక' అనే ఖండికలు ఎన్నదగినవి. ప్రభుత్వ తత్త్వముల గురించి వ్రాస్తూ 'మనువె రాచరికంబునకు మార్గదర్శి' అని చెప్పారు. రాచరికం మనువుకు ముందే వుండేదని రాజకీయ పరిజ్ఞానం కలిగినవారందరికీ తెలుసు. ప్రణాళికల గురించి వ్రాసిన వాటిలో అన్యదేశ్యాలను గుప్పించి వేశారు. 'సుంకము'ల గురించి వివరిస్తూ—

'జలధిలోనుండి జలమును జలధరములు
గ్రహణ మొనరించి లవణ విరహితమ్మైన
లిలమున్ సస్యముల కిడి సారరీతి
ంత సుంకాలగొని ప్రజాప్రగతి కిడును,

అని చక్కగా వర్ణించారు. పేరుపేరునా ఈ పుస్తకంలోని కావ్యఖండికలను గూర్చి వివరించటం కంటె, పాఠకులు దినపత్రికలను చదివినట్లు కాలక్షేపంకోసంకు, కేవలమూ విషయాలను తెలిసికొనేటందుకు ఈ పుస్తకం చదువుకోవచ్చు.

రామమోహనరాయ్.

Printed & Published For Nageswara Rão Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad